# విద్యార్థి సమస్యలు

## (వ్యాస సంగ్రహం)

సంకలన:
పరకాల పట్టాభిరామారావు

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# తొలిపలుకు

నేడు విద్యార్థుల్ని ఎన్నో క్లిష్ట సమస్య లెదుర్కొంటున్నాయి. తల్లిదండ్రులు కష్టపడి ఆర్జించిన డబ్బును వృధాచేయకుండా శ్రద్ధగా చదువుకోవాలి; తోడి విద్యార్థులతో మెలగేటప్పుడు సత్ప్రవర్తన అలవరచుకోవాలి; అధ్యాపకుల ఆదరాభిమానాల్ని పొందాలి. నలుగురిచేత సెభాష్ అనిపించుకొనేటట్లు మంచి మార్కులతో ప్యాసవాలి; ప్యాసయాక తన అర్హతకు అభిరుచికి తగ్గ ఉద్యోగం స్వీకరించాలి.

ఇదంతా ఒక ఎత్తు; యిందుకు ఆటంకాలుగా ఉన్న కొన్ని యిబ్బందుల్ని అధిగమించడం మరొక ఎత్తు.

బ్రిటిష్ పాలననాటి విద్యావిధానమే ప్రధానంగా నేటికీ మన పాఠశాలల్లోను హైస్కూళ్ళలోను కళాశాలలలోను అమలు జరుగుతూంది. అందుచేత మన జాతీయావసరాలకు తగినట్లు విద్యార్థుల మానసికశక్తులు వినియోగింపబడ్డంలేదు. తత్ఫలితంగా వారి చదువులు యిటు దేశానికీ తగినంతగా ఉపయోగపడ్డంలేదు; అటు విద్యార్థుల్ని సంతృప్తిపరచడం లేదు. పైపెచ్చు అనేక అవాంఛనీయమైన ప్రభావాలకు విద్యార్థి లోనవుతున్నాడు. క్రమశిక్షణ వారిలో తగ్గిపోతోంది. విద్యాస్థాయి పడిపోతోంది.

పరిస్థితు లింతకన్న విషమించకముందు విద్యార్థులు మేల్కొవాలి. ఈ దుస్థితికి కారణాలను అన్వేషించి, సాధ్యమైనంత త్వరలో దానిని చక్కదిద్దడానికి విద్యార్థులు ముందంజ వేయాలి.

ఈ ఉద్దేశంతో గత సంవత్సరం 'విశాలాంధ్ర' సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు వారపత్రికల్లో విద్యార్థి సమస్యలపై చర్చావేదిక నడుపబడింది. చాలమంది విద్యార్థులు తమ బాధలను వివరిస్తూ, వాటి నివారణకు మార్గాలు సూచించారు. ఆ వ్యాసాల్లోని ప్రధాన భాగాలన్నిటినీ యీ చిన్న పుస్తకంలో పొందుపరుస్తున్నాను. స్థలాభావంవల్ల వాటిని పూర్తిగా ప్రచురించడం వీలుకాకపోయింది. ఇందుకు రచయితలు క్షమిస్తారనుకుంటాను.

ఇందులోని వ్యాసాలన్నీ విద్యార్థుల నిత్య జీవితానికి సంబంధించిన సమస్యలపైనే వ్రాయబడ్డాయి. రాజకీయ పార్టీల, వాటి కార్యక్రమాల ప్రసక్తి వీటిలో లేదు. విద్యార్థులంతా యీ వ్యాసాలను వివేచనా దృష్టితో చదివి, విద్యార్థిలోకాన్నెదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించేందుకు తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తారని. అందుకు యీ చిన్న పుస్తకం దోహదం చేస్తుందని ఆశిస్తున్నాను.

పరకాల పట్టాభిరామారావు



# విద్యార్థులు : నేటి కర్తవ్యాలు

పరకాల పట్టాభిరామారావు

భారత స్వాతంత్ర్య పోరాటంలో విద్యార్థులు గర్వించదగిన పాత్ర నిర్వహించారు. అగ్రగాములుగా నిలిచి పోరాడారు. అయితే స్వాతంత్ర్య సంపాదనతో విద్యార్థుల కర్తవ్యం ముగిసినట్లేనా? విద్యార్థులలో ఆనాడున్న జాతీయోత్సాహం, దీక్ష ఈనాడు కనపడటంలేదనీ, వారిలో అశాంతి శిక్షణారాహిత్యం కనిపిస్తున్నాయనీ అనేక విమర్శలు చెలరేగుతున్నాయి. ఇది వాస్తవమేనా? అయితే ఇందుకు కారణం ఏమిటి? ఈ సమస్యలను మనం చర్చించవలసియుంది.

## నిరుత్సాహ వాతావరణం

ఈనాడు విద్యార్థులలో పూర్వపు జాతీయోత్సాహం, దీక్ష కానరాని మాట, వారిలో కొంత అశాంతి శిక్షణారాహిత్యం ప్రబలిన మాట నిజమే. ఇందులో సందేహం లేదు.

ఇందుకు కారణాలు ఏమిటో జాగ్రత్తగా పరిశీలించవలసియుంది.

జాతీయోద్యమ ఆశయాలలో "గుమాస్తాలను తయారుచేసే బానిస విద్యావిధానాన్ని" మార్చడం, వాస్తవిక జీవితంలో సంబంధంకల, జాతీయావసరాలను తీర్చగల విద్యావిధానాన్ని నెలకొల్పడం, విద్యావకాశాలను ఇతోధికం చేయడం, విద్యానంతరం ఉద్యోగం గ్యారంటీ చేయడం మొదలైనవి వున్నాయి. కాని స్వాతంత్ర్యం వచ్చిన ఈ పదిసంవత్సరాల కాలంలో విద్యార్థుల ఆశలేవీ నెరవేరలేదు. విద్యావిధానంలో ఈనాటికీ

చెప్పుకోదగిన సంస్కరణలు ఏవీరాలేదు. నూటికి దాదాపు 70 మందిని నిరర్థకులుగా నిర్ధారణ చేస్తున్న పరీక్షా విధానాన్ని మార్చలేదు. విద్యా సౌకర్యాలు బొత్తిగా పెరగలేదు. ప్రతిసంవత్సరం సీట్లకొరత, అధ్యాపకుల కొరత, లేబరేటరీల కొరత, హాస్టళ్ళకొరత ఈ విధంగా విద్యార్థులకు అన్నీ కొరతలే. ఇంజనీరింగ్, మెడికల్, పోస్టుగ్రాడ్యుయేట్ తరగతుల్లో సీట్లు కావాలంటే మంత్రులనుంచి కూడా సిఫార్సులు తెచ్చుకోవలసిన పద్ధతి, ఆశ్రితపక్షపాతం ప్రబలిపోయాయంటే మన విద్యావిధానం, విద్యాలయాలు ఎంత అధోగతిలో ఉన్నాయో, విద్యార్థులలో ఇది ఎంత అసంతృప్తిని రగుల్కొల్పుచున్నదో బోధపడుతుంది. దీనికితోడు చదువుకున్న తర్వాత యువతీయువకులకు ఉద్యోగ గ్యారంటీలేదు. నిరుద్యోగంతో ఎన్నాళ్ళు తిరగాలో తెలియదు. ఈనాటి యువకతరంలో అసంతృప్తికి, అశాంతికి ఇంతకంటె వేరే కారణాలు ఏం కావాలి? ఇట్టి పరిస్థితుల్లో విద్యార్థులలో నిరాశా నిస్పృహలు వ్యాపించుతున్నాయంటేను, వారిలో ఉత్సాహం దీక్ష సన్నగిలుతున్నాయంటేనూ ఎవరిని నిందించాలి? అసంతృప్తికి హేతువు లేమిటో కనుక్కొని వాటిని పరిష్కరించడంపోయి, విద్యార్థులు ప్రదర్శనలు జరిపారనీ, సమ్మెలు చేశారనీ, పెడమార్గాలు పడుతున్నారనీ నిందించి ప్రయోజనంలేదు.

అందుచేత విద్యార్థుల జీవితాల్లో నేడు ఆశాజనకమైన పరిస్థితులను తీసుకురావాలి. భవిష్యత్తుపై వారికి విశ్వాసం కల్గించాలి. సమాజంలో చైతన్యంగల ఒక ముఖ్యభాగంగా గుర్తించి, వారి దేశభక్తియుత కర్తవ్యాలేమిటో ప్రబోధించాలి. తిరిగి వారిలో జాతీయ ఉత్సాహాన్ని రగుల్కొల్పాలి. భావిపౌరులమనే భావం వారిలో కల్గించాలి.

## స్వాతంత్ర్య పోరాటదశలో

స్వాతంత్ర్య పోరాటదశలో దేశనాయకులు విద్యార్థులలో యిట్టి వంటి దేశభక్తినే రగుల్కొల్పారు. త్యాగదీక్షను పురిగొల్పారు. [illegible] "మీరు రాజకీయాల జోలికిపోవద్దు, స్వాతంత్ర్య పోరాటం గొడవ మీ కక్కరలేదు" అని అన్నారా? అంటేమాత్రం విద్యార్థులు లక్ష్యపెట్టేవారేనా? "బానిసవై బ్రతికేకంటె స్వతంత్రుడవై మరణించు", "విజయమో వీరస్వర్గమో", "వందేమాతరం – మందేరాజ్యం", "స్వరా[illegible]

నా జన్మహక్కు" అనే నినాదాలను ఆనాడు దేశనాయకులు యువకులకు ఇచ్చారు. విద్యార్థుల జాతీయకర్తవ్యమేమిటో నిర్దిష్టంగా వారిముందుంచారు. సహజంగా పురోగామితత్వం, దీక్ష, సాహసం గల యువకులు స్వాతంత్ర్య సమరంలో అగ్రగాములుగా నిలబడ్డారు. అమోఘమైన త్యాగాలు చేశారు. ఎందరెందరో విద్యార్థినీయులు జైళ్ళను, గుండెలను, తుపాకి బాలకు బలిస్తూ ఆత్మార్పణ గావించారు. భారతజాతి సగర్వంగా చెప్పుకొనే విధంగా వీరోచితంగా ప్రవర్తించారని యీ దేశనాయకులే ఆనాడు ప్రస్తుతించారు. వందేమాతరం ఉద్యమం మొదలుకొని 1919, 1930, 1942, 1946 ఉద్యమాలవరకు - నిన్న మొన్నటి గోవా సత్యాగ్రహంవరకు విద్యార్థులు పాల్గొనని జాతీయోద్యమాలంటూ లేవు. ఆంధ్రరాష్ట్రావతరణ వరకు విద్యార్థులులేని జాతీయోద్యమాలు ఆంధ్రలో లేవు.

## స్వాతంత్ర్య సంపాదనానంతరం

కాని దురదృష్టవశాత్తు దేశనాయకులు ఈ చరిత్రనంతా మరచి పోయారు. విశాల జాతీయోద్యమంలో విద్యార్థులుకూడా భాగస్వాములన్న మాట విస్మరించారు.

స్వతంత్ర భారత సౌధ నిర్మాణంలో విద్యార్థులకుకూడా సముచిత పాత్ర వుంటుందన్న విషయం వదిలివేశారు. ఒక్క మాటలో, స్వాతంత్ర్య సంపాదనానంతరం విద్యార్థుల జాతీయ కర్తవ్యాలేమిటో నాయకులు ఆలోచించలేదు. నిర్దిష్టంగా చెప్పలేదు.

"స్వాతంత్ర్యం వచ్చింది. ఇక మీరు రాజకీయాల జోలికి పోవద్దు. హాయిగా చదువుకోండి. అంతా మేము చూచుకుంటాం" అన్న ధోరణిలో విద్యార్థులపై చన్నీళ్ళు చల్లడం మొదలుపెట్టారు.

## విద్యా సంస్కరణలను ప్రవేశపెట్టలేదు

విద్యార్థులలో అరాచకత్వం, శిక్షణారాహిత్యం ప్రబలిపోతోందని దుయ్యబట్టడమే తప్ప వారి యిబ్బందులను, వారి మానసిక ఆందోళనను సానుభూతితో అర్థం చేసుకోవడానికి వీరు పూనుకోలేదు. పది సంవత్స రాల దీర్ఘకాలంలో కమిషన్లపై కమిషన్లు వేస్తున్నారే కాని జీవితానికి,

దేశానికి పనికివచ్చే విద్యావిధానాన్ని యేర్పరచలేదు. విద్యార్థులలో ఉత్సాహాన్ని కల్గించే విద్యాపద్ధతులను ప్రవేశపెట్టలేదు.

విద్యార్థులలో మార్కులవేట ఎక్కువైందనీ, కాపీలు కొడుతున్నారనీ విమర్శించడమే కాని ఇట్టి దుష్ట పద్ధతులకు ఆలవాలమైన - పక్షపాత పద్ధతికి మూలకారణమైన - నేటి పరీక్షా విధానాన్ని మార్చలేదు. ఎక్కువ మంది విద్యార్థులను ఏటా తప్పిస్తూ, యువకతరం శక్తియుక్తులను, కాలాన్ని, ధనాన్ని వమ్ముచేస్తున్న ఈ పరీక్షలు విద్యార్థుల జీవితాలను ఎంత కృంగదీస్తున్నాయో వారు గుర్తించడంలేదు.

## ఉత్తేజపరచే నాయకులు ఎవరు ?

విద్యార్థులకు నేడు సినిమాతారలే ఆరాధ్యదేవతలుగా ఉన్నారని అంటున్నారు. కాని వారు ఎవరిని ఆరాధ్యదేవతలుగా పెట్టుకోవాలో చూపించాలికదా ! జాతీయోద్యమకాలంలో దేశంకోసం సర్వస్వం ధారపోసిన నిస్వార్థ త్యాగమూర్తులు, భగత్‌సింగ్ వంటి విప్లవవీరులు, గాంధీజీ వంటి నాయకులు విద్యార్థులకు ఆరాధ్యదేవతలు. కాని నేడు వేళ్ళమీద లెక్కపెట్టగల ఏ ఒక రిద్దరో తప్పితే తమచుట్టూ ఉండేవారిలో ఎవరిని విద్యార్థులు వరవడిగా తీసుకోవాలి ? పదవీ రాజకీయవేత్తల్నా ? అధికార వ్యామోహపరులనా ? స్వార్థంలో మునిగి తేలుతున్నవారినా ?

విద్యార్థులలో చౌకబారు అభిరుచులు పెరుగుతున్నాయనీ, విద్యార్థినులపట్ల అసభ్యంగా ప్రవర్తిస్తున్నారనీ గమనించుతున్న పెద్దలు, దేశనాయకులు నీచాభిరుచులతో విద్యార్థులను ముంచెత్తుతున్న సెక్స్, డిటెక్టివ్, సినిమా తదితర చౌకబారు సాహిత్యాన్ని నిరోధించాలి. సెక్స్ అశ్లీలునే ప్రధాన వ్యాపార సాధనంగా పెట్టుకునే సినిమా చిత్రాలను అరికట్టాలి. కలుషితమైపోతున్న సాంఘిక వాతావరణాన్ని బాగుచేయాలి.

స్త్రీపురుషులు సమానులనే భావాన్ని, విద్యార్థినులను గౌరవంగా చూడాలనే సాంఘిక చైతన్యాన్ని కల్గించాలి. యువతులను అవమానాల పాల్జేస్తున్న వరకట్నాలవంటి సాంఘిక దురాచారాలను మాన్పించాలి.

విద్యార్థుల దృష్టిని, వారి మనస్సులను ఉన్నతాదర్శాలవైపు, సాంఘిక సంస్కరణలవైపు, దేశపురోభివృద్ధివైపు మళ్ళించాలి.

# నేటి జాతీయ కర్తవ్యాలు

ఏ దేశ చరిత్ర చూచినప్పటికీ ఆ దేశ స్వాతంత్ర్యోద్యమంలోను, విప్లవ పోరాటంలోనే కాక ఆ తరువాత దేశ పునర్నిర్మాణ కార్యక్రమంలోను, నూతన సమాజ నిర్మాణంలోనుకూడ విద్యార్థులు, యువకులు తప్పక అగ్రగాములుగా కనబడతారు.

ఎందుకంటే స్వాతంత్ర్యం సంపాదించడానికి ఎంత పోరాటం జరిపారో, ఎంత త్యాగం చేశారో, తర్వాత ఆ స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేసుకోడానికి, ఆర్థిక సాంఘిక మార్పులు తీసుకురావడానికి అంత పోరాటమూ జరుపవలసి ఉంటుంది.

పురోగామి శక్తులకు, ప్రతీపశక్తులకు ఎప్పుడూ సంఘర్షణ ఉంటూనే ఉంటుంది.

విద్యార్థులు, యువకులు పురోగామి ఉద్యమాలన్నిటికీ జీవంవంటి వారు. ప్రతీపశక్తులను ఢీకొనే ప్రథమశ్రేణి సైనికులు వారు. ఈ ప్రథమ శ్రేణి సైనికులులేనిచో ఏ ఉద్యమమైనా నిర్జీవంగానే ఉంటుంది.

సోషలిస్టు సమాజ విధానానికి సాగిపోవడమే నేడు దేశంముందున్న ప్రధాన కర్తవ్యమని దేశనాయకులు ఉద్ఘాటిస్తున్నారు. ఎవరైతే రేపు దేశ భారాన్నంతా వహించాలని అంటున్నారో అట్టి విద్యార్థులు అగ్రగాములుగా లేనిదే, భాగస్వాములు కానిదే సోషలిస్టు సమాజ నిర్మాణం సాధ్యమా ?

సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని ప్రత్యక్షంగాను, పరోక్షంగాను వ్యతిరేకించుతున్న శక్తులను ఓడించాలంటే, అందుకు ప్రజలను సమాయత్తం చేయాలంటే విద్యార్థులుకూడా గనుడంతు కృషిచేయాలి. అందుకు తగ్గ కార్యక్రమం అవలంబించాలి.

## జాతీయ పునర్నిర్మాణం : పంచవర్ష ప్రణాళిక

సోషలిస్టు సమాజ నిర్మాణానికి పంచవర్ష ప్రణాళిక ప్రథమ సోపానమని పదేపదే నాయకులు ఉద్బోధిస్తున్నారు. ద్వితీయ ప్రణాళిక నేడు అనేక చిక్కుల్లో ఉన్నదనీ, అది విఫలమైతే దేశభవిష్యత్తు అంధ

కారణంగా ఉంటుందని అన్ని పార్టీలవారు ఆందోళన పడుతున్నారు. ఇట్టి సమయంలో విద్యార్థులు ఏమి చేయాలి?

ఢిల్లీ యూనివర్శిటీలో పంచవర్ష ప్రణాళికపై జరిగిన గోష్ఠిలో యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ శ్రీ వి. కె. ఆర్. వి. రావు మాట్లాడుతూ చెప్పినమాటలను విద్యార్థులు, దేశనాయకులు కూడా గుర్తుంచుకోవడం మంచిది. ఆయన ఇలా చెప్పారు: "స్వార్థప్రయోజనాలకొరకు కొందరు దేశంలోనివారు, కొందరు విదేశాలవారు ద్వితీయ పంచవర్ష ప్రణాళికను కోతపెట్టించడానికి కుట్రలు పన్నుతున్నారు. భారత ప్రభుత్వం సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని లక్ష్యంగా పెట్టుకోవడం, ప్రభుత్వ యాజమాన్యాన పరిశ్రమలను నెలకొల్పడం - ఇవే ప్రస్తుత ఆర్థికచిక్కులకు ప్రధాన కారణాలని వీరు పెద్దపెట్టున ప్రచారం చేస్తున్నారు. అందుచేత యూనివర్శిటీలలోని విద్యార్థులు, అధ్యాపకులు పంచవర్ష ప్రణాళికకు అనుగుణ్యంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టాలి. ప్రణాళికకు అగ్రగాములుగా పనిచేయాలి."

శ్రీ వి. కె. ఆర్. వి. రావుగారి పిలుపు దృష్ట్యా విద్యార్థులు తీసుకోవలసిన తక్షణ కార్యక్రమం ఏమిటో నిర్ణయించుకోవాలి.

## విద్యార్థులే నవసమాజ నిర్మాతలు

స్వార్థ ప్రయోజనాలు కలవారు నేడు దేశంలో రావలసిన ఆర్థిక, సాంఘిక పరిణామాలను అనేక రూపాల్లో అడ్డుకుంటున్నారు. ముందుకాళ్ళకు బంధాలు వేస్తున్నారు. వ్యక్తిగత ప్రయోజనాలకు సామాజిక ప్రయోజనాలను బలిచేయాలని చూసేవారు, కుల మత భేదాలతో ప్రజలలో వైరుధ్యాలు పెంచేవారు, పాత సాంఘిక కట్టుబాట్లనే పట్టుకొని వేళ్ళాడేవారు ఉన్నారు. వీరి ప్రాబల్యానికి స్వస్తిచెప్పి ప్రజాస్వామిక సంస్కరణలను, నూతన సమాజ వ్యవస్థను నిర్మించడానికి విద్యార్థులు కంకణం కట్టుకోవాలి. రాజకీయ స్వాతంత్ర్యంతోపాటు ఆర్థిక, సాంఘిక న్యాయాలు చేకూర్చాలి.

ఇట్టి ఆర్థిక, సాంఘిక మార్పులు రానందువలననే విద్యావిధానంలో కూడా మార్పులు రావడంలేదనీ, నూతన సామాజిక వ్యవస్థలోనే నూతన

విద్యావిధానం రూపొందుతుందని సుప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త డాక్టర్ జ్ఞానచంద్ స్పష్టంచేశారు.

## జాతీయ జీవితంలో విద్యార్థులు ఒకభాగం

1953 జనవరిలో జరిగిన అఖిలభారత విద్యార్థి ఫెడరేషన్ 13 వ మహాసభకు అధ్యక్షత వహించుతూ ఆయన ఇలా అన్నారు :

"మీ విద్యకు, దేశ ఆర్థిక పరిస్థితికి అవినాభావ సంబంధ ముంది. అందువలన దేశ ఆర్థికవ్యవస్థ మారనిదే విద్యాభివృద్ధి అసాధ్యం. ప్రస్తుత ఆర్థికవ్యవస్థ ఉన్నంతవరకు నిరుద్యోగ సమస్యే కాదు - ఏ సమస్యా నెరవేరదు."

సామాజిక మార్పులు తీసుకురావడంలో విద్యార్థుల పాత్రను గురించి చెబుతూ డాక్టర్ జ్ఞానచంద్ యిలా అన్నారు: "దేశ స్వాతంత్ర్య పోరాటంలో ప్రధానపాత్ర వహించిన విద్యార్థులు స్వాతంత్ర్య సాధన తరువాత జాతీయ జీవితంనుండి దాదాపు అదృశ్యమయ్యారు...ఈనాడు దేశ నాయకులు మనకు నేవారంతా ఒకప్పుడు విద్యార్థులే. దేశ రాజకీయ జీవితంలో విద్యార్థుల ఉన్నతస్థానాన్ని వీరు మరుగుపర్చ చూస్తున్నారు. 'ముందు చదువుముఖ్యం' అనేసాకుతో విద్యార్థులు పురోగమించకుండా అడ్డుపడుతున్నారు. ఏదో ఒక రాజకీయపార్టీకి తోకగా విద్యార్థి సంస్థలు ఉండరాదన్న విషయం నిజమైనప్పటికీ, ప్రజల నెదుర్కొంటున్న సమస్య లలో విద్యార్థులు జోక్యం కల్పించుకోరాదని సలహా యివ్వడం అభివృద్ధి నిరోధక ధోరణిని సూచిస్తుంది ... కాన మీరు వాటినన్నింటిని సరకుగొనక మీ హక్కులకోసమేగాక ప్రజలను చైతన్యవంతులను చేసేందుకుకూడా కృషి చేయండి." Rg 1144 371-864

అందుచేత విద్యార్థులు ఈ అన్ని సమస్యలను ఆమూలాగ్రంగా చర్చించాలి.

## విద్యార్థుల వాణిని తిరిగి వినిపించాలి

నేటి తక్షణ జాతీయ కర్తవ్యాల నిర్వహణకు విద్యార్థులందరూ కలిసి విశాల ఉద్యమం నిర్మించాలి. విద్యార్థులవాణి తిరిగి బలంగా దేశ మంతటా వినబడాలి!

సత్వర విద్యా సంస్కరణలు, పంచవర్ష ప్రణాళిక, సోషలిస్టు సమాజ నిర్మాణం - అనే మూడు ప్రధాన నినాదాలపై విద్యార్థి లోకాన్నంతమూ సమీకరించాలి. తమలో ఉన్న లోపాలను, అరాచక లక్షణాలను దిద్దుకుంటూ ఆదర్శ జీవితాలను గడపాలి. విద్యార్థినులపట్ల గౌరవ మర్యాదలను, అధ్యాపకులపట్ల వినయవిధేయతలను, దేశంపట్ల ప్రేమను పెంపొందించుకుని స్వాతంత్ర్య పోరాటకాలంలో ఎట్టి కీర్తిప్రతిష్టలు సంపాదించారో నేడుకూడా అట్టి ఘనత సంపాదించాలి. "స్వాతంత్ర్యం నుండి సోషలిజానికి" పురోగమించడంలో అగ్రగాములు కావాలి.



# విద్యా సంస్కరణల ఆవశ్యకత

జి. వి. నారాయణ

పూర్వం విద్యార్థులకు స్వాతంత్ర్య సముపార్జనే ప్రధాన ధ్యేయంగా వుండేది. స్వాతంత్ర్యం వస్తే గుమాస్తాలను తయారుచేసే బానిస విద్యా విధానం మారి జాతీయావసరాల కనుగుణ్యమైన విధానం అమలులోకి వస్తుందనీ, ప్రతివానికీ విద్య అందుబాటులోకి వస్తుందనీ ఆనాడు విద్యార్థు లాశించారు. అందుచేత స్వాతంత్ర్య పోరాటంలో ఉరకలు వేసుకుంటూ ముందు కురికారు.

1947 ఆగస్టు 15న మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. విద్యార్థి తానాశించిన విధంగా విద్యా విధానంలో మార్పులు వస్తాయని ఎదురు చూశాడు. కాని స్వాతంత్ర్యం వచ్చి 10 సంవత్సరాలైనా విద్యా విధానంలో తానాశించిన మార్పులురాలేదు సరిగదా అనుకోని విధంగా అనవసర భారాలు కొన్ని మీద పడినాయి.

## సెకండరీ విద్య

సెకండరీ విద్యకు సంబంధించినంతవరకు పరిశీలించిచూస్తే యీ శాఖలో ప్రాథమికమార్పు ఒక్కటీ జరుగలేదు. గతంలో బోధించే చరిత్ర, భూగోళం సబ్జెక్టులను తీసివేసి వాటిస్థానే సోషల్ స్టడీస్ అనే సబ్జెక్టును ప్రవేశపెట్టారు. ఇదే స్వాతంత్ర్యానంతరం సెకండరీ విద్యకు సంబంధించినంతవరకు వచ్చిన ప్రధానమైన సంస్కరణ. దీనివలన అటు చరిత్ర, యిటు భూగోళం రెండూ రాని స్థితి యేర్పడింది.

గతంలో ఇంగ్లీషు, తెలుగు భాషలను విద్యార్థి చదవవలసివుండేది. కాని ఈకోమున హిందీని మూడవ భాషగా చదవాల్సివచ్చింది. ఇవి చాలవన్నట్లు సంస్కృతం కూడా నిర్బంధభాషగా చేయాలని ఆలోచిస్తున్నారు కొంతమంది పెద్దలు. రెండు భాషలే చదువలేని స్థితిలో వున్న విద్యార్థిపై హిందీని నిర్బంధభాషగా చేయడం చూస్తే గోరుచుట్టుపై రోకటిపోటువలె వుంది.

ప్రాథమిక సంస్కరణలు తీసుకొనిరాకపోవడం అటుంచి, పాఠ్యగ్రంథాలను మాత్రం ప్రచురణకర్తల శ్రేయస్సును ఆలోచించి మారుస్తూ వుంటారు. ఉదాహరణకు స్కూలుఫైనలులో గణితశాస్త్ర పుస్తకం తీసుకొంటే సరిపోతుంది. సిలబసు మారకపోయినా పుస్తకాలు మారుతూ వుంటాయి. ఏమిటీ మార్పుఅని ఆలోచిస్తే మరో రచయిత మరో ప్రచురణ కర్త మార్పు తప్పమరేమీ కన్పించదు. అదేవిధంగా సోషల్ స్టడీస్, సైన్సు కూడా. ఈ విధానంవల్ల విద్యార్థులకు అదనపుభారం, ప్రచురణ కర్తలకు లాభాలు తప్ప మరేమీ ఉండదు. కొలది హైస్కూళ్ళను మల్టీపర్పస్ స్కూళ్ళుగా చేశారు గాని ఫలితాలు కానరావడంలేదు.

## యూ ని వ ర్సి టీ వి ద్య

యూనివర్సిటీ విద్యనుచూస్తే ఇందులోకూడా ప్రాథమిక మార్పులు ఏమీ జరుగలేదనే చెప్పాలి. 1951 లో ఇంటర్‌మీడియెట్‌నుంచి సైన్సును అభివృద్ధి చేయాలని ఆర్ట్స భాగం తగ్గించి సైన్సును పెంచి పి. యస్. సి. ని ప్రవేశపెట్టారు. ఆ ప్రణాళిక రెండు సంవత్సరాలు నడిచింది. కాని దాని వల్ల ఫలితాలు ఏమీ కన్పించలేదు. ఇంగ్లీషుస్థాయి తగ్గిపోయిందని మాత్రం చెప్పారు. అందుచేత తిరిగి ఆర్ట్సను కూడా ప్రవేశపెట్టారు. విద్యార్థికి గతంలోవున్న ఆర్ట్స, సైన్సుకంటే యీ ప్రణాళికవల్ల సైన్స ఎక్కువ చదవవలసివచ్చింది. ఇది విద్యార్థిస్థాయికి మించినదని అనేకమంది విద్యావేత్తలు చెప్పారు. కాని ఆలకించినవారు లేరు.

## ప్రీ - యూనివర్సిటీ కోర్సు

భారత ప్రభుత్వం విద్యానిపుణుల కమిటీ సూచించిన రీతిగా ఇంటర్మీడియేట్‌ను రద్దుచేయాలని నిర్ణయించింది. ఇంటర్‌ను రద్దుచేసి ఏడవ

ఫారంను హైస్కూలులో నే పెట్టి బి. ఏ. మూడు సంవత్సరాలు కళాశాలల్లో బోధించాలని చెప్పింది.

ఏడవఫారంను హైస్కూళ్ళలో బోధించడానికి హైస్కూలు విద్యలో గణనీయమైన మార్పులు తీసుకొనిరావాలని కమిటీ అభిప్రాయం. అలాంటి మార్పులు తీసుకొని రావడానికి హైస్కూళ్ళలో అవకాశంలేదని ఏడవ ఫారానికి బదులు కళాశాలల్లో ప్రీ యూనివర్సిటీని ప్రవేశపెట్టాలని నిర్ణయించింది. ఆ నిర్ణయం ప్రకారం ప్రీ యూనివర్సిటీ కోర్సును ప్రవేశపెట్టినట్లయితే విద్యార్థులకు ఏ విధమైన కష్టాలు వస్తాయో ఆలోచించకుండా కొన్ని యూనివర్సిటీలు [illegible] కళాశాలల్లో ప్రీ యూనివర్సిటీని ప్రవేశపెట్టాయి. గత సంవత్సరానికి ఫలితాలు చూస్తే మద్రాసు యూనివర్సిటీనుండి ఆందోళన బయలుదేరింది. కొందరు ప్రముఖ విద్యావేత్తలు ప్రీ యూనివర్సిటీవల్ల నష్టాలు వచ్చాయనీ తిరిగి ఆలోచించవలసిందనీ ప్రభుత్వాన్ని, యూనివర్సిటీని కోరారు. ఈ విధంగా అనాలోచితంగా కొన్ని సంస్కరణలు తీసుకొనిరావడం చూస్తే విద్యార్థులను ప్రయోగ పరికరాలుగా వుపయోగించుతున్నారనేది బోధపడుతుంది.

## వాస్తవికతతో సంబంధంలేని చదువులు

పోస్టు గ్రాడ్యుయేట్ విద్యార్థుల పరిస్థితి చూచినా తాము చదివే విషయంపై పూర్తి పరిజ్ఞానం సంపాదించలేని స్థితిలో వున్నారు. గణిత శాస్త్ర విద్యార్థులను తీసుకొంటే క్రొత్తగా ఆ శాస్త్రంలో వచ్చే మార్పులు వీరికి బోధించబడవు. ప్రపంచంలోని ముఖ్య గణితశాస్త్రవేత్తల పేరులు కూడా వీరికి తెలియవంటే అతిశయోక్తి కాదేమో. మన గణిత శాస్త్రం చదివే విద్యార్థులలో భారత గణితశాస్త్రవేత్తలలో అగ్రగణ్యుడైన రామానుజంగారి పేరు తెలియనివారు ఎంతో మంది ఉన్నారంటే మన విద్యా విధానం ఏవిధంగా కరుడుకట్టిన పాతపద్ధతుల్లోనే కొనసాగుతూందో వివరించ నవసరంలేదు. ఇదే పరిస్థితి మిగిలిన విషయాలలోకూడా.

వ్యవసాయశాస్త్రం చదివే విద్యార్థిని తీసుకొన్నా యింతే. వ్యవసాయ శాస్త్రంలో విద్యార్థులు చదువవలసిన పుస్తకాలు ఇంగ్లండు పొలాల గురించో, కెనడా పొలాలగురించో వ్రాసివుంటాయి. రచయితలు అక్కడి వారవడమే దీనికి కారణం. మన విద్యార్థులు ఆ పుస్తకాలను చదివి విద్యా

లయాల బయటికి వస్తే వారు సలహాలు యివ్వవలసిన భూమి, పంటల పరిస్థితి వేరు – వారు చదివివచ్చిన భూమి, పంటల పరిస్థితి వేరు. దీనివల్ల మన వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరులకన్న అనుభవంగల రైతులు యిచ్చే సలహాలే అమూల్యంగా వుంటున్నాయంటే మన విద్యాపరిస్థితి ఏవిధంగా వుందో తెలుస్తుంది.

## ప్రాంతీయ భాషలో విద్య బోధించరేమి ?

హైస్కూలువిద్య ప్రాంతీయభాషలో బోధించడం, కళాశాలవిద్య యింగ్లీషులో బోధించడంవల్ల విద్యార్థుల అవస్థ చెప్పనక్కరలేదు. హైస్కూలు విద్యనంతను తెలుగులో చదివి కళాశాలకు వెళ్ళిన వెంటనే ఇంగ్లీషులో చదవవలసిన రావడంవల్ల విద్యార్థి తాను చదవవలసిన సబ్జెక్టు కంటే ముందు ఇంగ్లీషుభాషను నేర్చుకోవాల్సి వస్తున్నది. ఇది విద్యార్థి అభివృద్ధికి ఎంతో ఆటంకంగా తయారైంది. ఇంటర్‌మీడియేట్ వున్నపుడు విద్యార్థి దాదాపు మొదటిసంవత్సరమంతా ఇంగ్లీషును అర్థంచేసుకొనడానికే సరిపడేది. రెండవ సంవత్సరంలో మాత్రం సబ్జెక్టును అర్థం చేసుకోవడం ప్రారంభించేవాడు. ఈ విషయం విద్యార్థులకు అధ్యాపకులకు తెలియని విషయంకాదు.

కాని యీ స్థితిలో త్రీ యూనివర్సిటీ కోర్సును ఇంగ్లీషులో ప్రవేశపెట్టారంటే విద్యార్థి యే విధంగా ఒక్క సంవత్సరంలో నియమించిన కోర్సును చదవగలడో యీ స్కీమును ప్రవేశపెట్టినవారికే తెలియాలి. ఏమాత్రం విద్యాభివృద్ధిని, విద్యార్థుల శ్రేయస్సును కోరేవారైనా యీ విషయాన్ని అర్థంచేసుకొని వుండేవారు. కాని మన ప్రభుత్వానికిగాని, యూనివర్సిటీ అధికారులకుగాని యీ విషయం ఎక్కడా అంతుచిక్కలేదు. మన యూనివర్సిటీ 1957 లో త్రీ యూనివర్సిటీ కోర్సును ప్రవేశపెట్టింది. దీనితో తనకున్న పోర్షన్ చదవలేక విద్యార్థి, పోర్షన్ యెలా పూర్తిచేయాలా యని ఉపాధ్యాయుడు పడే ఆందోళన వారిరువురకే తెలియాలి. ఈ దశలో విద్యార్థి తాను చదవవలసిన విషయంకంటె యింగ్లీషును ప్రధానంగా నేర్చుకోవాల్సి వస్తున్నది.

మాతృభాషలో విద్యాబోధన జరపాలని ఆంధ్ర విద్యార్థులు చేసిన ఆందోళన ఫలితంగా ఆంధ్ర యూనివర్సిటీ గతంలో మాతృభాషలో

విద్యాబోధన జరపాలనే సూచనను అంగీకరించింది. ప్రభుత్వం కూడా ప్రయత్నిస్తామని చెప్పింది. కాని యింతవరకూ ఏ ప్రాథమిక చర్యా తీసుకోలేదు. కనీసం శ్రీ యూనివర్సిటీనైనా తెలుగులో ప్రారంభించుతారని ఆశించారు విద్యార్థులు. ప్రక్కనేవున్న మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం ప్రాంతీయ భాషలలో విద్యాబోధన జరిపేందుకుగాను సాంకేతిక పదాలను తయారుచేసేందుకు ఒక కమిటీని వేసింది. ఆ కమిటీ తన పనిని పూర్తిచేసిందికూడా. కాని మన ప్రభుత్వం యీ విషయమై ఏ చర్యా తీసుకోలేదు.

## అశాస్త్రీయమైన పరీక్షా విధానం

ఈవిధంగా యీరోజు ఎన్నో అవాంతరాలు విద్యార్థులముందున్నాయి. వీటన్నింటినీ అధిగమించివస్తే ఒక పెనుభూతంవలె కాచుకొనివుంటుంది పరీక్షా విధానం. తెలివితేటలతోను, విజ్ఞానాభివృద్ధితోను నిమిత్తంలేకుండా ఏదోవిధంగా ప్రశ్నకు సమాధానం వ్రాయడం ఒక్కటేకోరే అశాస్త్రీయమైన ఈ పరీక్షావిధానం విద్యార్థులను ఎంతో కృంగదీస్తోంది. వారి శక్తి సామర్థ్యాలను నిరుపయోగం చేస్తోంది. అందుకనే డాక్టరు రాధాకృష్ణగారు తన ప్రణాళికలో విద్యావిధానంలో ఏమైనా మార్పులు తెచ్చేముందు యీ పరీక్షా విధానాన్ని తొలగించాలని చెప్పారు. ఆయనమాదిరిగానే అనేకమంది విద్యావేత్తలు చెబుతున్నారు. కాని భారత ప్రభుత్వం మాత్రం ఎందరు విద్యావేత్తలు చెప్పినా, ఎన్ని కమిటీలు చెప్పినా పట్టించుకొనే స్థితిలేదు.

1957 స్కూలు ఫైనలు పరీక్షలు తీసుకొంటే ఎంత దారుణంగా వున్నాయో తెలుస్తుంది. నూటికి 25 గురు విద్యార్థులుమాత్రమే ఉత్తీర్ణులైనారంటే ఈ పరీక్షా పద్ధతి ఎంత అక్రమమైనదో వేరే చెప్పాలా? ఇంతమంది తప్పిపోవడానికి కారణం ఏమిటని ప్రతి తల్లి, తండ్రి, విద్యార్థి, విద్యార్థి శ్రేయోభిలాషి ఆందోళన చెందుతున్నారు. కొంతమంది విద్యార్థులు తాము ఎందుకు తప్పిపోతున్నారో కారణం తెలియక ఆత్మహత్యలు కూడా చేసుకొనుట జరుగుతూంది. ఏమిటి దీనికి కారణం? దీనికి రెండు కారణాలు కనిపిస్తాయి. ఒకటి ప్రభుత్వ విద్యావిధానం; రెండవది ఆ విధానానికి మూలమైన అశాస్త్రీయ పరీక్షా విధానం.

## ఎంతమందిని తప్పించాలో ముందే నిర్ణయం !

ఈ పరీక్షా పద్ధతిని, యీ విద్యావిధానాన్ని తమకు కావలసినంత మందిని మాత్రమే ఉద్యోగులను తయారు చేసుకోడానికిగాను బ్రిటిష్ వారు ప్రవేశపెట్టారనేది నిర్వివాదాంశం. విద్యావిధానాశయం గుమాస్తాలుగ తయారుచేయడమే కనుక ఉత్తీర్ణులసంఖ్య పెరిగితే ఉద్యోగాలు కల్పించాలి. ఉద్యోగాలు కల్పించలేనప్పుడు చదువుకొని నిరుద్యోగులుగా వుంటే స్వాతంత్ర్య పోరాటంలో భాగస్వాములై తమ పనుగడకే ముప్పు తెస్తారని బ్రిటిష్‌వారి భయం. అందుచేత అవసరమైనంతమందినే ఉత్తీర్ణులను చేయడానికి పనికివచ్చే విధంగా పరీక్షా విధానాన్ని సృష్టించుకొన్నారు.

కాని ఆనాటికి యీనాటికీ పరిస్థితులు మారాయి. ఈరోజు పరాయి పాలనలేదు. జాతీయ ప్రభుత్వ మేర్పడింది. కనుక జాతీయావసరాలకు వినియోగించే విధంగా మన విద్యా విధానం ఉండాలి. కాని ఆ విధంగా మారలేదు. బ్రిటిష్ పరిపాలనలో బోధించబడ్డ విద్యనే మన విద్యార్థులు ఈనాటికీ చదువవలసివుంటోంది. విద్యా విధానం మారలేదు. కనుకనే పరీక్షా విధానం కూడా అదే విధంగా మిగిలింది.

ఈ పరీక్షా ప్రమాణానికి కూడా ఒక నియమమంటూ లేదు. సమయానుకూలంగా మారుతూ వుంటుంది. ఒక సంవత్సరం యింగ్లీషులో 30 మార్కులు వస్తే ఉత్తీర్ణుడై, మరో సంవత్సరం 33 మార్కులు వచ్చి తప్పిపోతాడు స్కూలుఫైనలు విద్యార్థి ! ఎక్కడుంది ఈ కిటుకు ? ఎక్కువగా యింగ్లీషు మార్కుల ప్రమాణమే తగుతూ హెచ్చుతూ వుంటుంది. ఎక్కువగా యింగ్లీషులో మార్కులు రాని విద్యార్థి తప్పిపోతాడు.

## సమయానుకూలంగా మారే ప్రమాణాలు

ఏ ప్రమాణంతో విద్యార్థిని ఉత్తీర్ణుణ్ణి చేస్తారో, ఏ ప్రమాణంతో తప్పిస్తారో కూడా సాధారణంగా మామూలువారికి బోధపడదు. ఉదాహరణకు స్కూలుఫైనలు తీసుకొంటే సరిపోతుంది. ఇంగ్లీషు తెలుగులలో కలిపి మొత్తం 70 మార్కులు రావాలనే నియమముంది. ప్రత్యేకంగా ఇంగ్లీషులో 30%, 33% మార్కులు వస్తే ఉత్తీర్ణుడయ్యేందుకు అర్హతవుంది. తెలు

గులో 35% మార్కులు వస్తే ఉత్తీర్ణుడయ్యేందుకు అర్హతవుంది. కాని రెండింటిలో వేరు వేరుగ ఉత్తీర్ణతకు కావలసిన మార్కులు వచ్చినా మొత్తం కలవదు గనుక, విద్యార్థి తప్పిపోతూవుంటాడు. ఈ రెండింటిలో కలసి 69 మార్కులు వచ్చి తప్పిపోయే విద్యార్థు లనేకమంది. మిగిలిన మూడు సబ్జెక్టులలో కలిసి 100 మార్కులు రావాలనే నియమముంది. ప్రత్యేకంగా తీసుకొంటే రెండింటిలో 35% న్నా, ఒకదానిలో 25% మార్కులు వస్తే ఉత్తీర్ణుడు కావచ్చు. ఆ విధంగా ఉత్తీర్ణతకు కావలసిన మార్కులు వచ్చినా మొత్తం కలవక తప్పించబడతాడు విద్యార్థి. సచే వారి నియమానుసారం పై రెండు మొత్తాలు వచ్చినా, తిరిగి అన్నింటిలో కలసి 175 మార్కులు రావాలని మరొక నియమముండుటవలన యీ మొత్తం రాకపోతే తప్పించుతారు.

ఈవిధంగా విద్యార్థిని తప్పించేందుకు ఎన్ని మార్గాలు కావాలో అన్నీ మన పరీక్షా విధానంలో వున్నాయి. మొత్తం175 మార్కులు వస్తే విద్యార్థి ఉత్తీర్ణుడౌతాడన్న నియమంచూస్తే అంత కంటే ఎక్కువ మొత్తాలు మార్కులువచ్చి తప్పించబడే విద్యార్థులు అనేకమంది వున్నారు. 200-250 మార్కులు మొత్తంవచ్చి ఇంగ్లీషులో ఒక్క మార్కు తక్కువైందనో, ఇంగ్లీషు తెలుగులలో కలసి రావలసిన మొత్తానికి ఒక్క మార్కు తక్కువైందనో తప్పించబడ్డ విద్యార్థు లనేకమంది. ఇదేవిధంగా ఇంటర్, బి. ఎ. లలో కూడా మరోరూపంలో జరుగుతూ వుంది.

## పనికట్టుకొని తప్పించడం ఘోరం

వీటన్నిటినిబట్టి చూస్తే లోపభూయిష్టమైన పరీక్షావిధానంతో పాటు ప్రభుత్వంకూడా పనికట్టుకొని తప్పించడం జరుగుతోందని తెలుస్తోంది. ఈ పరీక్షా పద్ధతిని మార్చనంతవరకు విద్యార్థులు యీ విధంగా బలికావలసిందే. కనుక పరీక్షావిధానాన్ని తక్షణం మార్చవలసివుంది. విద్యార్థులు కాపీలుకొట్టి ఏదోవిధంగా మార్కులు సంపాదించేందుకు తయారవుతున్నారని, వాచర్లపై దౌర్జన్యాలకు తలపడుతున్నారని ఫిర్యాదులు తరచు వింటున్నాము. ఇవి నిరసించదగ్గ అరాచక ధోరణులే- అపమార్గాలే. అయితే అందుకు మూలకారణమైన పరీక్షావిధానం ఇట్లా ఉండగా వీటిని నిర్మూలించలేమని గుర్తించాలి.

వీటన్నింటికితోడు తల్లిదండ్రుల ఆర్థిక పరిస్థితులు అభివృద్ధి కాక పోయినా, జీతాలు రుసుములు పెరుగుతూ వస్తున్నాయి. వీటికిమాత్రం అడ్డూ అదుపూ లేదు. జీతాలు, రుసుములు పెరగడంతోపాటు సౌకర్యాలు పెరుగుతున్నాయా అంటే అదిమాత్రం శూన్యం. చాలీచాలని భవనాలు, పరికరాలులేని లేబరేటరీలు, లేబరేటరీలులేని స్కూల్సు, ఉపాధ్యాయుల కొరత, టెక్స్టు పుస్తకాలు సకాలంలో అందించకపోవుట, సీట్లకొరత, థియరీకి ప్రాక్టికల్‌కి అన్వయం లేకపోవుట మొదలుగాగల అసౌకర్యా లెన్నో వున్నాయి. వీటన్నిటిమధ్యన నలిగిపోతున్నాడు విద్యార్థి. తను చేయవలసింది కానరాక తన అసంతృప్తిని సమావేశాలద్వారాను, సభల ద్వారాను, చివరికి చేయగల్గింది లేక సమ్మెలద్వారాను వ్యక్తం చేస్తుంటే; విద్యార్థులకు క్రమశిక్షణ లోపించిందనీ, చదువులపై కేంద్రీకరణ తగ్గిందనీ నాయకులు విమర్శించుతున్నారు. ఈ విమర్శకు సమాధానం కావాలంటే డాక్టర్ రాధాకృష్ణగారు, శ్రీ సి. డి. దేశముఖ్ గారు విద్యార్థుల సమావేశాల్లో యిచ్చిన ఉపన్యాసాలే సరిపోతాయి. యూనివర్సిటీ వార్షికోత్సవాలలో మాట్లాడుతూ శ్రీ దేశముఖ్ విద్యార్థులకు అనేక [illegible] లున్నాయనీ, అందువల్ల వారు ఆందోళన చెందుతున్నారనీ చెప్పారు. పరీక్షా విధానం, విద్యాపద్ధతులు మార్చాలని చెప్పారు.

## అంధకారంగావుండే భవిష్యత్తు

ఇన్ని అవాంతరాలను తప్పించుకొని బయటపడ్డా విద్యార్థికి వుద్యోగం లేదు. తాను చదివిన చదువు యేమాత్రమూ అంటే తన నిత్య జీవితానికి యెందుకూ పనికిరానిది. అందుచేత విద్యార్థినై ఏ విధంగా తన జీవిత సమస్యను సరిదిద్దుకోవాలనేదే అతనిని పీడిస్తూంటుంది.

ప్రతి విద్యార్థికి తాను ఒక యింజనీరునై తన దేశాభివృద్ధికి అనేక ప్రాజెక్టులు నిర్మించుటలో తోడ్పడాలని యెంతో అభిలాష వుంటుంది. అదే విధంగా తాను డాక్టరై తన ప్రజలకు వైద్యసేవ చేయాలనే అభిలాష వుంటుంది. అదేవిధంగా సైన్సులో అభివృద్ధిచెంది తన దేశ గౌరవాన్ని ప్రపంచం నలుమూలలా చాటాలనే ఆతురత ఉంటుంది. ప్రతిరంగంలో తన ముందున్నదని నిరూపించడానికి అవకాశం దొరకడం లేదేమా యని బాధ పడుతూ వున్నాడు యీ రోజు విద్యార్థి.

విద్యార్థుల అభిరుచులను, ఆసక్తులను సద్వినియోగపరచే మార్గాలు చూపకుండా దేశపురోభివృద్ధిలో వారుముందు లేరని విద్యార్థులను నిందించడం న్యాయం కాదు. ప్రభుత్వాధిపతులు, రాజకీయ నాయకులు విద్యార్థుల మానసికాందోళనను, సమస్యలను గుర్తించవలసివుంది.

రెండవ పంచవర్ష ప్రణాళిక విజయవంతం కావాలని, తన దేశం ముందుకు పోవాలని విద్యార్థి ఆశిస్తున్నాడు. కాని తను ఏ విధంగా దేశాభివృద్ధికి తోడ్పడాలనే తికమకలో విద్యార్థి ఉన్నాడు. తాను ఏదో ఒక రంగంలో నిపుణుడై దేశాభివృద్ధికి తోడ్పడాలని ఆశిస్తూంటాడు విద్యార్థి. కాని యీ చదువులవల్ల ఆ ఆశలు, ఆశయాలు ఏమీ నెరవేరటం లేదన్నది ముందు గమనించవలసిన విషయం.

కనుక జాతీయాభివృద్ధిని, జాతి సౌభాగ్యాన్ని కోరే ప్రతివారు విద్యావిధానాన్ని జాతీయావసరాల కనుగుణంగా మార్చేందుకు కృషి చేయాలి. కనుక ప్రభుత్వం వెంటనే విద్యా విధానాన్ని మార్చవలసివుంది. దీనికిగాను ప్రతి రాజకీయపార్టీ ప్రత్యేకశ్రద్ధ తీసుకొని పనిచేయాల్సి వుంది. అదేవిధంగా తల్లిదండ్రులు అప్పులుచేసి తన బిడ్డలకు డబ్బు పంపడం మాత్రమేగాక వారు చదువుతున్న విద్యవల్ల ఎంత ఉపయోగముంటుంది? విద్యా విధానంలో ఏ మార్పులను ప్రభుత్వం తెస్తూంది అనే విషయాన్ని కూడా చూడాల్సివుంది.

ఇక విద్యార్థులు - యీ విద్యావిధానం మనకు తప్పదని, వుద్యోగం వచ్చినా రాకపోయినా తల్లిదండ్రులు డబ్బు యిస్తున్నారుగదా యనీ పట్టీపట్టనట్లు కూర్చుంటే మార్పులు రావు. జాతీయాభివృద్ధికి కీలకమైన విద్యావిధానాన్ని తీసుకొని వచ్చేవరకు ఆందోళన చేయవలసివుంది. మన పంచవర్ష ప్రణాళిక విజయవంతం కావాలన్నా, దేశాభివృద్ధి జరగాలన్నా ప్రధానంగా యీ విద్యావిధానం మారాలి. ఈ మార్పుకొరకు ఆందోళన పోరాటం యీనాడు విద్యార్థులు వివిధ వర్గాల ప్రజల సహకారంతో చేయాల్సివుంది.



# విద్యార్థులు : విద్యా ప్రమాణాలు

అట్లూరి విప్లవకుమారి

విద్యార్థుల పురోభివృద్ధికి ఉపాధ్యాయులు, ప్రభుత్వం విద్యకు సంబంధించిన అందరూ సహకరించాలి.

విద్యార్థులనుగురించి ఆలోచించేటప్పుడు రెండు ముఖ్య విషయాలు పాఠకుల దృష్టికి వస్తాయి. ఒకటి విద్యార్థులలో స్థాయి పడిపోవటం, రెండవది శిక్షణా రాహిత్యం.

భావిభారత పౌరులుగా తయారుకావలసిన నేటి విద్యార్థులకు ఏ రెండు విషయాలు అతి ముఖ్యమో ఆ రెండు ప్రధాన విషయాలే లోపించడం ఎంతో విచారించదగ్గ విషయం. ఈ రోజుల్లో శిక్షణా రాహిత్యం వలన అరాచకత్వం విపరీతంగా పెరుగుతోంది.

## స్థాయి పడిపోతున్నది ఎక్కడ ?

కాలేజీ విద్యకు పునాదియైన హైస్కూలు విద్యలోనే స్థాయి పడిపోతున్నది. హైస్కూళ్ళు జూన్‌లో తెరిస్తే ఆగస్టు వరకు పుస్తకాలు రావు. ఈ రెండు నెలలలో ఆ సంవత్సరానికి విద్యార్థికి కావలసిన గ్రామరు మొదలైన జనరల్ సబ్జెక్ట్స్ చెప్పవచ్చు. కాని ఎక్కడో నూటికి ఒకటి రెండు స్కూళ్ళలోతప్ప ఈ కాలాన్ని సద్వినియోగ పరచుకోవటం లేదు. తరువాత సబ్జెక్ట్స్ పూర్తిచేయుటలోనే ఉపాధ్యాయులు నిమగ్నులవుతారు. కొన్ని స్కూళ్ళలో కోర్సుకూడా పూర్తికాదు. ఇటువంటి పరిస్థితులలో విద్యార్థులు ప్రైవేటు చదువక తప్పదు. ఈ ప్రయివేటు చెప్పేదికూడా హైస్కూళ్ళలో పనిచేసే ఉపాధ్యాయులే. నీరు స్కూలు

నుండి వచ్చినది మొదలు మరల స్కూలుకు వెళ్ళేవరకు తనకున్న శక్తిలో ప్రధాన భాగాన్ని ట్యూషన్లు చెప్పడానికే వెచ్చిస్తున్నారు. వారే తిరిగి స్కూలుకువచ్చి శ్రద్ధగా విద్యగరపటం అసాధ్యమనే విషయం వేరుగా చెప్పనవసరం లేదు. ప్రయివేటు విద్యార్థులను పరీక్షలలో ఉత్తీర్ణులను చేయుటకిది కొంతవరకుపయోగపడుతుంది కాని, విద్యార్థుల స్థాయి పెరుగుటకేమీ ఉపకరించదు. ప్రయివేటు చెప్పకపోతే ఉపాధ్యాయులకిచ్చే జీతం వారిజీవితావసర వస్తువులకే చాలదు. ప్రభుత్వమిది గమనించి ఉపాధ్యాయులకు సరిపడుజీతాలేర్పాటు చేసి ప్రయివేట్లు లేకుండా వారిశక్తిని స్కూళ్ళలోనే వినియోగించేలా చూడాలి.

## ఇన్ని భాషలా ?

ఇప్పటికే రెండుభాషలతో విద్యార్థులు కుస్తీ పడుతుంటే, మూడవ భాష అయిన హిందీనికూడ వారిపై రుద్దుతున్నారు. ఇదికూడ చాలదన్నట్లు కొందరు మంత్రులు సంస్కృతమును ప్రవేశపెట్టవలెనని కోరుచున్నారు. ఇన్ని భాషలు ఉంచినయెడల దేనిలోనూ అతడు తన ప్రతిభను చూపలేకపోవచ్చును. వీటన్నింటికీ బదులు మాతృభాషలోనే విద్యను బోధించిన యెడల విద్యార్థి యిప్పటికంటె చాల ఎక్కువ విషయములను నేర్చుకొనగలడు.

ఇప్పుడు మనకున్న పరీక్షా పద్ధతివలన విద్యార్థియొక్క తెలివితేటలభివృద్ధికావు. పరీక్ష పెట్టేది సెలెక్టు చేయబడిన పుస్తకములలో కాబట్టి పరీక్ష కనుకూలముగ తయారగుటకు విద్యార్థి ప్రయత్నించును. ఒకొక్కప్పుడు బాగా చదివినవారికి తక్కువమార్కులు రావచ్చు. కొన్ని సెలెక్టు చేసికొని చదివినవానికి అవే పరీక్షలయందు వచ్చినచో ఎక్కువ మార్కులు రావచ్చు. కాబట్టి యీ పరీక్షాపద్ధతి విద్యార్థుల తెలివితేటలను పరీక్షించుట కుపయోగించదు.

హైస్కూలులో ఎస్. ఎస్. ఎల్. సి. వరకు ఒక్క ఇంగ్లీషు తప్ప తక్కిన సబ్జెక్టులు అన్నియు మాతృభాషలోనే బోధించుచున్నారు. కాలేజీ విద్యకు రాగానే ఒక్క తెలుగు తప్ప తక్కిన సబ్జెక్టులు అన్నీ ఇంగ్లీషులోనే చదవాలి. అందువలన ప్రతి విద్యార్థికి ఒక సంవత్సరం వరకు ఇంగ్లీషును అర్థం చేసుకొనుటకు, రెండవ సంవత్సరము పరీక్షకొరకు

చదువ్వుటకు సరిపోతుంది. ఇట్లు విద్యార్థి ఎక్కువ విషయములు నేర్చుకొనుటకు అవకాశముండదు. ఈవిధముగా విద్యార్థి తగుస్థాయి లేకుండానే పైన విద్యను కొనసాగించుచున్నాడు.

## చదువు విషయంలో అజమాయిషీ లేదు

విద్యార్థులకు హైస్కూలు విద్యనుండి క్రమశిక్షణలేదు. ఒక టీచరు, ఒకరోజు ఒక పాఠం చెప్పిన ఆ పాఠము అంతటితో సమాప్తమయినట్లేననుకోవాలి. మరుటి దినము దానిమీద ప్రశ్నలు వేయుటగాని, చెప్పగాని హైస్కూలు విద్యలోనే లోపించినది. చదివిన విషయాలపై అజమాయిషీ లేనియెడల, వారు చదువుటకు ప్రయత్నించరు. కనుక సోమరులుగా తయారవుటకు ఎక్కువ వీలు అవుతుంది. హైస్కూళ్లలో ఎస్. ఎస్. ఎల్. సి. ప్యాసయి కాలేజీ విద్య నభ్యసించుటకు వస్తారు. కాలేజీలలో హైస్కూలులోవున్న క్రమశిక్షణకూడవుండదు. క్రమశిక్షణలేకుండా సోమరులుగ తయారగుటకు విద్యార్థులొక్కరే కారణంకాదు. సాధారణముగ కాలేజీలలో కొన్ని గంటలే పాఠాలు జరుగుతాయి. ఎంతో కాలం వృథా అవుతుంది. అప్పుడు దూరమునుండి వచ్చిన విద్యార్థులు ఉదయం కాలేజీకొచ్చి సాయంత్రం వరకు కూర్చోవాలి. ఈ లోపు వీరు నేర్చుకొను విద్య మాత్రం 2 గంటలు. ఖాళీ టైములో చదవాలంటే చదువుకొనుటకు గదులుండవు. ఎక్కడైనా కూర్చుని చదవ మొదలిడితే ఆ లెక్చరర్ వచ్చుటతోడనే వారిని ఆ గదినుండి వెళ్ళిపొమ్మంటాడు. అటువంటి పరిస్థితులలో వారికేమీతోచక, దారినపోయే వారివైపు చూచి నవ్వుతూ మొదలు పెడతారు. కాలేజీ విద్యలో కూడ యేదో చెప్పుకుపోవడమే కాని దానినెంతవరకు చదివారని అజమాయిషీ చేయుపద్ధతి చాల కాలేజీలలో లేదు. ఈ విధంగా క్రమశిక్షణలేకుండా విద్యార్థులుంటున్నారంటే దానికెవరు కారకులో స్పష్టంగా తెలుస్తూనే వుంది.

తగిన జాగ్రత్త, అజమాయిషీ వున్న కాలేజీలలో నూటికి 85 మంది ప్యాసయినసంగతి అందరకూ తెలిసిన విషయమేకదా! విద్య సరియైన పద్ధతులలో నేర్పుతూంటే విద్యార్థిస్థాయి కూడా దానంతటదే పెరుగుతుంది. ఆ కాలేజీలలో నూటికి 85 మంది ప్యాసయి తక్కిన కాలేజీలలో నూటికి 25 మంది ప్యాసవుటకు కారణమేమిటి? అక్కడ వారు పరీక్షలు, వాటిని

సరిగా ఆన్సరు చేయనియెడల దానికి చెక్, ఆలస్యంగా వెళ్ళిన అద లింపులు, లెక్చర్లు ఆలస్యంగా వచ్చిన ప్రిన్సిపాల్ చర్య తీసుకొనుట, వారంలో యే ఒక్క రోజయినను గంటకూడా ఖాళీగా లేకుండుట, ఎప్పుడన్నా లెక్చరర్ సెలవు పెడితే ఆ గంటలో ఖాళీగావున్న ఇంకొక లెక్చరర్‌ని వేయుట మొదలగునవి చేయుచున్నారు. ఈ విధంగా చేసినచో విద్యార్థులకు స్థాయి పెరుగుతుంది. అటు యెక్కువమంది ప్యాసవుటకు వీలుగాకూడా వుంటుంది.

మనదగ్గర ఫీజులనేకం కట్టుకొనుచున్నారు. కాని అవన్నీ మనకెట్టి వుపయోగము కలిగించుటలేదు. ఇక కో-ఎద్యుకేషన్ వున్నచోట్ల ఆడపిల్లలకు ఆటలుగానీ, మరేవిధములైన సౌకర్యములుగాని ఉండుటలేదు. ఇట్లు ఫీజు మాత్రము కట్టుకొని ఏవిధములైన సౌకర్యములు లేకుండాచేసి లాభము పొందుట వ్యాపారము పెట్టుకొన్నట్లున్నది. మన ఫీజులన్నీ మనకు సద్వినియోగ పర్చేట్లు, విద్యాశాఖ నిబంధనల ప్రకారం చెప్పేట్లు ముందు ఏ కాలేజీ విద్యార్థులాకాలేజీ కమిటీలపైన ఆందోళన చేయుటకు పూనుకోవాలి. విద్యాసంస్థలన్నియు విద్యార్థులతో ఈ విషయంలో సహకరించాలని నా అభిప్రాయం. అట్లే హైస్కూలు విద్యార్థులుకూడ ఇతర సంస్థల సహాయముతో వారి చదువును గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి.



# పుస్తకాల సంఖ్యను పెంచితే విద్యాస్థాయి పెరుగుతుందా?

జి. వెంకటేశ్వరరావు

ఉపాధ్యాయుడుగా నా అనుభవాలు కొన్ని తెలుపుతాను. ఒకటవ తరగతినుండి 5వ తరగతి వరకు చదివే కాలంలోనే విద్యార్థికి చదువంటే రుచికల్గించాలి. పిల్లల మనస్తత్వాలను గ్రహించి బోధించాలని ట్రైనింగ్ కాలంలో నేర్చుకున్నా, అది మర్చిపోతారో లేక ఆచరణలో సాధ్యంకాక కేవలం విధాన బోధకమాత్రంగా ఉండిపోతుందో తెలియదు.

ఎయిడెడ్ స్కూళ్ళలో ప్రధానంగా గ్రాంటులకోసం చూస్తారు. పిల్లలెందరు వచ్చినా రాకపోయినా హాజరుపట్టీ నిండుగానే వుంటుంది. ప్రతినెలా వచ్చే జీతాలలో అక్కడక్కడ పనిచేసే ఉపాధ్యాయులు మేనేజరుకు ముడుపులు చెల్లించుకోవాలి.

తరువాత ప్రైవేటు టీచరు స్కూల్లో చెప్పించటం, మార్కులు తక్కువైతే వేయించడం యివన్నీ జరుగుతాయి. హైస్కూల్లో చేరిన దగ్గర నుండి విద్యార్థి ట్యూషన్ల ప్రపంచంలో అడుగుపెడతాడు. తనవద్దకు ట్యూషన్లకు వచ్చే విద్యార్థులపై ఉపాధ్యాయుడు ప్రత్యేకాభిమానం చూపుతాడు. "ధనమెట్టివారికిం, గడుగాని చేయకుండునే జగన్నుత గర్వము, దుర్వ్యామోహామున్" అన్న నన్నయగారి పలుకులు చాలావరకు వర్తిస్తాయి. ఆర్థికస్తోమతు లేక, జీతాలుచాలక ఉపాధ్యాయుడు పడేబాధలు తెలియనివి కావు. ప్రైవేటు చెప్పిన కుర్రవాళ్ళను ప్యాస్ చేయలేకపోతామా అనే

ధీమా సహజంగా కల్గుతుంది. దీనితో బడిలో పాఠాలు శ్రద్ధగా చెప్పడం సంపగిస్తుందేమో అనే సందేహం కల్గుతుంది. ఇక పరీక్షహాలులో ఎవరి విద్యార్థులకు వాళ్ళు చెప్పుకుంటూ నేవుంటారు! దీనివల్ల ఉపాధ్యాయుల పట్ల ప్రజలలో సామాన్యంగా ఉండే సానుభూతి తగ్గిపోతుందేమో నన్న భయం కల్గుతోంది. మాకు జీతాలు పెంచడం సంభవిస్తే యిది కొంత వరకు తగ్గగలదనే మా నమ్మకం.

ఇక విద్యా విధానాన్ని చూస్తే గుంటూరుజిల్లాబోర్డు హైస్కూళ్లలో లోయర్ ఫారములలో తెలుగు నాన్ డిటెయిల్డు పుస్తకాలు ఆరు. హయ్యర్ ఫారములలో ఇంగ్లీషు నాన్డిటెయిల్స్ నాలుగు 12-16 వయస్సు లోపల వారికి ఇన్ని గ్రంథాలు "సిలబస్"లో పెట్టడం అంతన్యాయంగా కనిపించదు. పుస్తకాల సంఖ్య ఎక్కువచేస్తే విద్య ఎక్కువ వస్తుందా? చెప్పిన మేరకు క్షుణ్ణంగా చెబితే కొంతవరకు ఉపయోగపడుతుంది. పాస్ మార్కులు 35 కంటె తగ్గించితే విద్యాస్థాయి తగ్గిపోతుందేమో. అందుచేత గరిష్ట సంఖ్యకు ⅓ వంతు కన్న తగ్గించడం మంచిదికాదు. దీనితోబాటు ఇంగ్లీషు, హిందీ, ముందు ముందు సంస్కృతంగూడా ప్రవేశపెడితే ఉన్న కొద్ది కాలం, శక్తి అనేక వాటిమీద విస్తరింప జేయటం వలన విద్యాస్థాయి మరింత సన్నగిల్లుతుంది. దీనిని పెద్దలు విచారించాలని మనవి. మొదటినుండీ స్థాయి లేనివాళ్ళు ఎస్. ఎస్. ఎల్. సి. వరకు వచ్చి ఆగిపోక తప్పడం లేదు.

పూర్వపు ఇంటర్మీడియేట్ లో అక్షమాస విషయాలపై కేంద్రీకరించడానికి వీలయ్యేది. ప్రీ-యూనివర్సిటీకోర్సు ఎంతమాత్రం ఫలించుతుందో తెలియదు. ముందు ముందు ఏమార్పులు వస్తాయో తెలియకుండా ఉంది.

కళాశాల విద్యావిధానంలో ముఖ్యంగా 'సాంఘిక ప్రవర్తన' గురించి ఒక సబ్జెక్టు ఉండాలి. ఇది నిర్బంధం చేసినా తప్పులేదు. జీవితంలో ప్రవేశించాక, భార్యాపిల్లలతో ఎల్లా మెలగవలసిందీ, అప్పులెలా తెచ్చుకొని ఎల్లా తీర్చవలసిందీ, ఎవరి నెవిధంగా గౌరవించాల్సిందీ, సంఘంలో ఎల్లా మెలగవలసిందీ మొదలైనవి నేర్పాలి.

తరువాత పైతరగతులకు పాఠ్యగ్రంథాలు వ్రాయించడంలోకూడా తగు జాగ్రత్త తీసుకోవాలి.

# పంచవర్ష ప్రణాళిక - విద్యార్థులు

ఆలూరు వెంకట్రావు

మనం మొదటి పంచవర్ష ప్రణాళిక గడిచి రెండవ పంచవర్ష ప్రణాళికలో కొంతవరకు వచ్చాం. భారత విద్యార్థులు భారతజాతిలో అంతర్భాగం. పంచవర్ష ప్రణాళికలోగాని, దాని ఫలితాలలో గాని విద్యార్థులకు భాగం వుండక తప్పదు. అందుచేత ప్రణాళిక గురించి విద్యార్థులు, ప్రణాళికలో విద్యార్థుల పాత్ర గురించి ప్రభుత్వమూ ఆలోచించక తప్పదు.

రెండవ పంచవర్ష ప్రణాళిక తన లక్ష్యాలను క్రింది విధంగా నిర్వచించింది:

(ఎ) "దేశ జీవనస్థాయి పెంపొందించడంకోసం జాతీయాదాయాన్ని గణనీయంగా అభివృద్ధి పర్చాలి; (బి) "ప్రాథమిక భారీ పరిశ్రమల పైన తగిన శ్రద్ధవుంచి, సత్వర పారిశ్రామికాభివృద్ధికై కృషి చేయాలి;" (సి) "ఉద్యోగావకాశాలను ఎక్కువ చేయాలి;" (డి) "ఆదాయాల మధ్య అసమానతను తొలగించి సంపదను మరింత సక్రమముగా పంపకం చేయాలి."

## ప్రజా సహకారం

ఇందుకు ఉత్పత్తి అధికం కావాలి. పరిశ్రమలను, భూములను, రైల్వేలను, బ్యాంకులను సంఘపరం చేసినప్పుడు యిది సాధ్యపడుతుంది. ఇదే అభిప్రాయాన్ని మన ప్రణాళికకూడ నొక్కి చెబుతున్నది. అంతేకాక దేశంలోవున్న ఖనిజసంపదను, యితర ఆర్థిక వనరులను ప్రభుత్వం సాధ్యమైనంత ఎక్కువగ ఉపయోగించుకొనవలసి వుంటుంది. ఇంతేగాక అతిముఖ్యమైన, ప్రణాళిక విజయవంత మవటానికి అత్యవసరమైన "మానవశక్తిని" అనగా ప్రజాసముదాయాన్ని కూడ ఉపయోగించుకొనగలగాలి. అప్పుడే

ప్రణాళిక విజయవంత మవుతుంది. ఈ సందర్భంలో చైనా అనుభవాన్ని గ్రహించవలసిన అవసరం ఎంతోవుందని ప్రొఫెసర్ మహాలనోబిస్ నొక్కి చెప్పారు.

ప్రణాళిక ప్రజాతంత్రయుతంగాను, సాంఘిక అసమానతలను తొలగించే విధంగాను ఉండాలన్న ప్రధాన లక్ష్యాలు ఒకదానితో ఒకటి జతగా సాధించబడాలి. పంచవర్ష ప్రణాళికను తమ స్వార్థం కోసం ఉపయోగించుకొనజూచే కొద్దిమంది వ్యక్తుల ప్రాబల్యంనుండి దాన్ని అప్పుడే తప్పించగలుగుతాం. ప్రజాసహకారం పొందటం అప్పుడే సాధ్యమవుతుంది. ప్రణాళికను ప్రజలు తమదిగా భావించుకొన్నప్పుడే విజయం సిద్ధించుతుంది. ప్రణాళికను స్వార్థపరుల ప్రాబల్యంనుండి తప్పించగలిగినప్పుడు, అధికారుల అంతస్థునుండి దింపి ప్రజాస్థాయికి తీసికొనివచ్చినప్పుడు ప్రజలు ప్రణాళికను తమదిగా భావించుకొనగల్గుతారు. ప్రణాళికలో యీ మార్పు తీసుకొని వచ్చేటట్లు ప్రభుత్వాన్ని వత్తిడి చేయాలి.

## నిరక్షరాస్యత నిర్మూలన

దేశాన్ని దారిద్ర్యంనుండేగాక అజ్ఞానంనుండి కూడ విముక్తిచేయటం పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలలో ఒకటి. భారతదేశంలో నూటికి 16.6 గురు విద్యావంతులు. రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేనాటికి యిది 20% అవుతుంది. ఇది చాలా తక్కువ సంఖ్య. మిగిలిన వారిని కూడ విద్యావంతులను చేయవలసిన బృహత్కార్యాన్ని దృష్టిలో వుంచుకొని దానికై విద్యార్థుల సహాయాన్ని సాధ్యమయినంత ఎక్కువగా పొందడానికి ప్రభుత్వం ప్రయత్నించాలి.

దీనికై ప్రభుత్వం విద్యార్థి సంఘాలను గుర్తించాలి. స్థానిక సంస్థలకు, విద్యార్థులకు సంబంధముండేటట్లు చూడాలి. సక్రమమైన పద్ధతిలో నిరక్షరాస్యతా నిర్మూలనకు, సాంఘిక దురాచారాలను తొలగించటానికు పెద్దయెత్తున ఉద్యమాలు సాగేటట్లు చూడాలి. జాతీయాభివృద్ధి సలహా సంఘాలలో అన్నిస్థాయిలలోను విద్యార్థులకు కూడా ప్రాతినిధ్య మివ్వాలి.

## ఆర్థిక పురోగమనాని కనుగుణ్యమైన విద్య

ప్రభుత్వం విద్యార్థి సమస్యలను గూర్చి శాంతంగా పరిష్కరించ గలిగితే వారి విశ్వాసాన్ని మరింత చూరగొనగలుగుతుంది. విద్యాసంస్క

ణలను గూర్చి విద్యార్థులు చేసే ప్రత్యామ్నాయ సూచనలను ప్రభుత్వం సానుభూతితో పరిశీలించాలి. ప్రాథమిక విద్యనుండి యూనివర్సిటీ విద్య వరకు అందరికీ చదువుకొనే అవకాశాలను సమానంగా కల్పించాలి. ఇది కొంతమందికి స్కాలర్‌షిప్పులు యిచ్చినందువలన సాధ్యపడదు. సమాజంలో దారిద్ర్యాన్ని నిర్మూలించాలి.

రెండవ పంచవర్ష ప్రణాళికలో విద్యావిధానంగురించి యీ విధంగా చెప్పబడింది: "ఒక దేశం అనుసరిస్తున్న విద్యావిధానం ఆ దేశపు ఆర్థిక పురోగమనంమీద నిర్ణయాత్మకమైన ప్రభావం కలిగి వుంటుంది." కాని, విద్యావిధానాన్ని ఆ విధంగా సంస్కరించలేదు. ప్రణాళిక నిర్వహణలో ఇదొక ప్రధానలోపం.

ప్రభుత్వం 'సాముదాయిక అభివృద్ధి కార్యక్రమాలను' (కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రాజెక్ట్సు), జాతీయ వికాస కేంద్రాలను ఏర్పాటుచేసింది. ఇంకా "భారత్ సేవక్ సమాజ్" వంటి సంఘాలకు చేయూతనిస్తున్నది. విద్యార్థులు వీటి కార్యక్రమాలను పరిశీలించి నిర్మాణాత్మకమైన సూచనలు చేసి అభివృద్ధికరస్కీములకు తోడ్పడాలి. సోషల్ సర్వీస్ లీగ్ ద్వారా, ఎన్. సి. సి. ద్వారా ప్రభుత్వ కార్యక్రమానికి చేయూతనివ్వాలి.

ద్వితీయ ప్రణాళిక ఎదుర్కొంటున్న చిక్కులను గురించి మనం రోజూ తెలుసుకొంటున్నాము. ప్రణాళిక విఫలమైతే దేశభవిష్యత్తు అంధకారం అవుతుంది. ఈ చిక్కులను ఆధారంగా తీసికొని, సామ్రాజ్యవాదులు మనదేశంపై అనేక ఒత్తిడులు తీసుకొనివస్తున్నారు.

అందుచేత ప్రణాళికను జయప్రదంగా అమలుజరపడం యీ సందర్భంలో విద్యార్థుల కర్తవ్యం అవుతుంది. ఢిల్లీయూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ శ్రీ వి. కె. ఆర్. వి. రావుగారు మాట్లాడుతూ యూనివర్సిటీ విద్యార్థులు, అధ్యాపకులు ప్రణాళికకు అగ్రగాములుగా పనిచేయాలన్న విషయాన్ని గుర్తుపెట్టుకోవాలి. ప్రణాళికను జయప్రదం చేయడంలో విద్యార్థులు తమవంతు కర్తవ్యం నిర్వహించాలి.



# దేశపునర్నిర్మాణానికి, విద్యావిధానానికి సమన్వయం అవసరం

### జీ. ఎస్. మూర్తి

విద్యార్థుల ముందున్నవి రెండు ప్రధాన సమస్యలు. ఒకటి : జాతీయ విద్యావిధానం. రెండు : జాతీయ పునర్నిర్మాణం.

10 సంవత్సరాల తర్వాత కూడా విద్యావిధానం మారలేదు. గుమాస్తాగిరి చదువే అసలు జరుగుతోంది. దేశ పురోభివృద్ధికి రెండవ సోపానంగా తీసుకున్న ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కూడా దేశ పునర్నిర్మాణానికి, విద్యా విధానానికి సమన్వయంలేదు.

ఉదాహరణకు చెప్పాలంటే వ్యవసాయం ప్రధానంగాగల మన దేశంలో వాస్తవిక వ్యవసాయ జీవితంతో సంబంధంలేని వ్యవసాయ శాస్త్రం నేర్పుతున్నారు. వ్యవసాయశాస్త్ర పట్టభద్రుడు మన రైతుల ముందు తీసికట్టు! ఈ విద్యావిధానాన్ని సంస్కరిస్తే రెండు సమస్యలు ఒకేసారి పరిష్కారమవుతాయి. విద్యార్థికి వాస్తవిక జీవిత పరిస్థితులతో సంబంధం ఏర్పడుతుంది. అప్పుడు దేశానికి, వ్యవసాయాభివృద్ధికి ఉపయోగ పడతాడు. అందుచేత జాతీయావసరాల కనుగుణ్యంగా విద్యా విధానాన్ని సంస్కరించాలి.

అన్నిటికన్న ముఖ్యం తనకోసం, తన జాతి ప్రయోజనాలకోసం చదువుతున్నాననే అభిప్రాయం విద్యార్థికి కల్గించాలి. అదే నిజమయిన జాతీయ విద్యా విధానం. జాతీయ పునర్నిర్మాణానికి విద్యార్థి తన పాత్రను నిర్వహించడానికి ఇది మార్గాన్ని సుగమం చేస్తుంది.

ఈ సందర్భంలో విద్యార్థులు ఇంకో ముఖ్యవిషయాన్ని కూడా ఆలోచించాలి.

1942 నుండి 1953 వరకు జరిగిన ప్రతిపోరాటంలో మహాప్రవాహంలా పాల్గొన్న విద్యార్థులు ఇప్పుడు తమ సమస్యలపైననే కదలకుండా ఉన్నారు. ఈవిధంగా మూకీభావం వహించడం తమకుతామే అన్యాయం చేసుకోవడం, తమజాతి ప్రయోజనాలను విస్మరించడం అవుతుంది. 1953 లో ఆంధ్రరాష్ట్ర స్థాపనకై విద్యార్థులు కేంద్రీకృత నాయకత్వం లేకపోయినా విశాఖపట్నంనుంచి హిందూపురంవరకు ఒకేనినాదంపై కదలి బ్రహ్మాండంగా ఆందోళన చేశారు. ఆనాటి సమధికోత్సాహం ఈనాడు ఎందుకు కానరావడంలేదు? ఆ చొరవ ఎందుకు కొరవడింది? సమస్యలు తగ్గాయా? మెరుగైన పరిస్థితులు ఏర్పడ్డాయా? అటువంటిదేమీ జరగలేదే! పైపెచ్చు అధికమయ్యాయి. దీనికంతకీ కారణం ఒకటే కనిపిస్తోంది. జాతీయ స్వాతంత్ర్య పోరాట దశలోవలెనే జాతీయ పునర్నిర్మాణ దశలో కూడా విద్యార్థుల కర్తవ్యాలుంటవని గ్రహించకపోవడమే. జాతీయ పురోభివృద్ధిని గురించి ఆలోచించకుండా మిన్నకుండడమే. జాతీయ పురోభివృద్ధి, విద్యాసంస్కరణలు, ఇతోధిక విద్యావకాశాలు ఒకదానితో ఒకటి ముడిపడి ఉన్నాయని అర్థం చేసుకోలేకపోవడమే. ఈ కర్తవ్యతా విమూఢతవలననే విద్యార్థులలో నేడు నిరాశా నిస్పృహలు వ్యాపించి ఉన్నాయి. జాతీయ జీవితంలో కీలకస్థానంలో ఉన్న విద్యార్థులు "కింకర్తవ్యం?" అన్న స్థితిలో యింతవరకు ఉన్నందుకు వగచి పనిలేదు. కార్యరంగంలో దిగాలి. కార్యక్రమం వేసుకోవాలి. కలిసి చర్చలు జరపాలి.



# సాంకేతిక విద్యావకాశాలు కల్గించాలి

'శేషగిరి'

హైస్కూళ్ళనుండి కాని, ఆర్ట్సు, కామర్సు కాలేజీలనుండి కాని ఉత్తీర్ణులై వచ్చే విద్యార్థులసంఖ్య, సాంకేతిక కళాశాలలనుండి వచ్చేవారికంటె ఎన్నోరెట్లు ఎక్కువగా ఉంటుంది. అందుచేత సాంకేతిక వృత్తివిద్యకోసం దేశంలో ఎక్కువ అవకాశాలు కలిగించాలనడం నిర్వివాదాంశం.

దేశంలో పదవికితగ్గ అర్హతలుగల యింజనీర్లు మొదలైన సాంకేతిక నిపుణులు లేరంటూ గగ్గోలు పెడుతున్నారు. చదువుకొని దేశ పునర్నిర్మాణ కార్యక్రమంలో పాల్గొంటాము అంటూంటే వారికి అటువంటి అవకాశాలు కలిగించకుండా దేశానికి సాంకేతిక నిపుణులు కావాలంటే ఏమి లాభం? అనేక వేలమంది సాంకేతిక కళాశాలల్లో సీట్లులేక తప్పనిసరిగా ఆర్ట్సు కాలేజీలలో చేరడం జరుగుతూంది. ఈ చదువు గుమస్తా వుద్యోగానికి తప్ప మరెందుకూ ఉపయోగించదు. దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందడానికి ఇంటర్, బి. ఏ. లు ఎందుకూ కొరగావు. అయినా ఆ కాలేజీలే ఎక్కువగా ఉండటం, సాంకేతిక కళాశాలలు తక్కువగా ఉండటం ఈనాటికీ తప్పలేదు.

ఉద్యోగం చేస్తున్నా ఉన్నత విద్యాభ్యాసానికి మన దేశంలో ఎక్కువ అవకాశా లున్నాయి. బహు తక్కువ నగరాలలోనే రాత్రి కళాశాల లుంటున్నాయి. కళాశాలలుగల ప్రతిచోటా రాత్రి తరగతులు ఏర్పాటుచేస్తే యింకా ఎక్కువమంది విద్య నభ్యసించగలరు.

కాని దురదృష్టవశాత్తు నేడు ఇటువంటి అవకాశాలు ఉన్నవాటిని కూడా తీసివేస్తున్నారు. ప్రైవేటుగా పరీక్షకుకూచునే అవకాశాలకు కొన్ని యూనివర్సిటీలు స్వస్తి చెప్పాయి. ఈ చర్యలు విద్యావ్యాప్తికి బదులు దానిని నిరోధిస్తున్నాయి. ఉద్యోగస్తులకు రాత్రి కళాశాల సౌకర్యం ఉన్నచోట్లకూడా, పై చదువుకు అవకాశం కొద్ది ఆఫీసుల్లో మాత్రమే యిస్తున్నారు. పై చదువుకు అవకాశంయిస్తే తమను మించిపోతారనే దురుద్దేశ్యంతో కొన్ని సందర్భాలలో పై అధికారులు వారికి అవకాశం యివ్వ నిరాకరిస్తున్నారు. ఇది దారుణమైన విషయం. అందుచేత ఉద్యోగస్తులందరికీ తమ తీరిక సమయాల్లో ఏది చదువుకుందుకైనా అవకాశం యిచ్చి విద్యార్థికి తోడ్పడ్డం సమంజసం.

# విద్యార్థులు : సాంఘిక సంస్కరణలు

## శ్రీ వాసిరెడ్డి సత్యనారాయణ

తరతరాలుగా వస్తున్న ఆచారాల పేరుతో సాగిపోతున్న గుడ్డి విధానా లేవైనాసరే వాటిని నిర్మొగమాటంగా విసర్జించటం, ఆచరణ ద్వారా ఆదర్శప్రాయులు గావటం విద్యార్థులకే సాధ్యం. విద్యార్థి దశలో సాధారణంగా స్వార్థచింతన, సంకుచిత దృష్టి, ఈర్ష్య, అసూయ, ద్వేషం వంటి భావాలు గట్టిగా నాటుకోవు. నిష్కామ్మిక దృక్పథం, సాహసం నిండుగా ఉంటాయి. కనుకనే, వ్యక్తిగతంగానూ, సంఘటితంగానూ కూడా సాంఘిక సంస్కరణలకు కృషి చేయటానికి హెచ్చు అవకాశాలు విద్యార్థులకే వున్నవి.

వరకట్నాలవంటి సాంఘిక దురాచారాలను రూపుమాపేందుకు విద్యార్థి సంఘాలు ప్రచార ప్రబోధాలు సాగించాలి. విద్యార్థులు ముఖ్యంగా వివిధ సంఘాలకు నాయకత్వం వహిస్తున్న వారు ఆదర్శప్రాయంగా వ్యవహరించి, యితరులకు మార్గదర్శకత్వం వహించాలి. సామాజిక జీవితంలో స్త్రీలపాత్రను, పురుషులతో పాటు సమాన గౌరవప్రతిపత్తుల నొసంగవలసిన ఆవశ్యకతను ప్రచార ప్రబోధాలతో బాటు ఆచరణద్వారా ప్రజల నుత్తేజపరచాలి. జనాభాలో సగం మందిగావున్న స్త్రీలు, సామాజిక కార్యకలాపాలలో కూడా సమాన భాగస్వామ్యం పొందునట్లు చూడాలి.

దేశంలో స్వైరవిహారం జేస్తున్న కులతత్వ మహమ్మారిని పారద్రోలి, వివిధ కులాలకు చెందినవారి మధ్య సహన సౌభ్రాతృత్వాలు నెలకొల్పటకు కృషి జరగడం ఎంతైనా అవసరం. వర్ణాంతర వివాహాలు అందుకు దోహదకరం కాగలవు. విజ్ఞానవంతులైన, అభ్యుదయభావాలు గల్గిన విద్యార్థిని విద్యార్థులు ముందుకు వచ్చిననాడు దారుణ పరిణామాలకు దారితీస్తున్న కుల, మత విద్వేషాలను అరికట్టడం సులభం.

అస్పృశ్యతవంటి సాంఘిక దురాచారాన్ని నిషేధిస్తూ శాసనం ఉన్నా ప్రచారం యింకా అవసరం. అలాగే మద్యనిషేధం విషయం. త్రాగుడు దుష్ఫలితాలను ప్రజలకు బోధించటంద్వారా మద్యనిషేధ కార్యక్రమం జయప్రద మొనరించడానికి తోడ్పడవచ్చు.

లంచగొండితనం, అవినీతి విలయతాండవం జేస్తున్నవి. అవినీతి నిర్మూలనంలో విద్యార్థులు ప్రముఖపాత్ర వహించవచ్చు.

# విద్యార్థులలో కులతత్వభావాలు కూడదు

ఎ. బి. కె. ప్రసాద్

పాత సామాజిక శక్తుల్ని పారద్రోలి తమంతట తాము నూతన జీవన విధానాన్ని అలవర్చుకోవాలనే జిజ్ఞాసగాని, ధీమాగాని ఈనాటి మన విద్యార్థులలో లేకపోవడంవలన నైతిక ప్రమాణాలు సన్నగిల్లుతున్నాయి. అనేకచోట్ల భావి పౌరులయిన విద్యార్థుల్లోకూడ కులతత్వ సమస్య పెచ్చు పెరుగుతోంది.

కళాశాల ఎన్నికల విషయంలో కూడా ఈ కులతత్వ సమస్య అనేకస్థలాల్లో తలెత్తుతోంది. ఈ సమస్య ఎంతవరకూ వెళ్ళిందంటే పట్టుదల వచ్చి ఒక కాలేజీలో ఒక కులానికి సంబంధించినవారంతా కలసి ఒక్కరు కూడా మిగులకుండా గ్రూపు ఫోటో తీయించుకున్నారు! ఈ పట్టుదల విద్యార్థులందరికీఉన్న సమస్యల్ని పరిష్కరించుకోవడంలో అడ్డువడుతూంది.

విద్యార్థుల్లో ఉడుకురక్తం ప్రవహిస్తున్నప్పటికి ఆ ఉత్సాహాన్ని యిష్టం వచ్చినట్లు తిప్పకూడదు. రోమారోలా అన్నట్లు, యువకులు తమ పాల పొంగుకి కొన్ని అడ్డుకట్టలు పోసుకోవాలి. లేకపోతే జీవితం అంధకారం అయ్యే పరిస్థితి ఏర్పడుతుంది.

చేతులు వూరుకోక చేసేపనులుకూడా చాలా ఉంటున్నాయి. రైలు పెట్టెల్లోవుండే ఖరీదైన పరుపుల్ని కోయడం, లైట్లు, ఫ్యూజులు తీసివేయడం మొదలైనవి. ఇటువంటి చర్యల్ని మనం అరికట్టుకోవాలి. ఈ చర్యలు జాతీయ గౌరవానికెంతో భంగకరం. ఇటువంటి ప్రవృత్తి మానాలంటే యువకులైన విద్యార్థులు జాగ్రత్తలు తీసుకోవాలి.

స్వీయాభివృద్ధిని గురించి, నైతిక పటిమగురించి, సాధన ప్రతి ఒక్కరికి ఎంతో అవసరం. మనం స్వయంగా నేర్చుకోలేని కొన్ని విషయాలు కొందర్ని చూసి నేర్చుకుంటాం. అలాగే విద్యార్థులు కూడా ఆదర్శ జీవితాలు కల్గినవారి సాంగత్యం పొందాలి. వాళ్ళతో స్థాయికితగ్గ సమస్యల్ని చర్చించుకోవాలి. తమలో తాము గోష్ఠులు జరుపుకోవాలి.

వారి సలహాన్ని పొందడం ఎంతో అవసరం. ప్రతి విషయంలోను ఎవరిని గూర్చి అయినాసరే ముందే ఒక అభిప్రాయాన్నేర్పరచుకొని దాన్ని సాధించడానికి ప్రయత్నించకూడదు.

అదేవిధంగా, చిన్నతనంలోనే నుంచి గ్రంథపఠనం అలవర్చుకోవాలి. గ్రంథాలు చదవడంవల్ల ఏవో విషయాలు తెలియడమే కాదు కావాల్సింది; అవగాహన చేసుకున్న ప్రతివిషయాన్ని జీవితంతో పోల్చుకుని దాన్నుంచి మంచిని గ్రహించే శక్తి కూడా సంపాదించుకోవాలి. అలాగే - కేవలం పాఠ్యపుస్తకాలకే మన జ్ఞానాన్ని పరిమితం చేసుకోకూడదు. అలా జరిగితే మనకొక విధమైన సంకుచితభావాలేర్పడి జాతీయతకే భంగం వాటిల్లే ప్రమాదముంది.

ప్రభుత్వం విద్యార్థుల సమస్యల్ని సానుభూతితో పరిష్కరించాలి. ఆదర్శ జీవితాలు గడిపేందుకు అనువైన వాతావరణం కల్పించాలి.



మత కుల ప్రసక్తి కూడదని, అట్టి వివక్షగ పనికిరాదని ఒక లౌకిక[illegible] మన రాజ్యాంగచట్టం నిర్దేశించుతూంది. కాని హైస్కూళ్ళు, కాలేజీ, యూనివర్శిటీలలో చేరబోయేటప్పుడు దరఖాస్తుఫారాల్లో కులం, మతం ఏమిటో వ్రాయిస్తుంటారు. కుల వివక్షత అధికారవర్గం దృష్టిలోనే ఉంటే ఇక విద్యార్థులలోను, అధ్యాపకుల్లోను, కాలేజీ కమిటీల్లోను, ప్రజల్లోను ఎక్కడ నశించుతుంది? కాలేజీ ఎన్నికల్లో బయలుపడుతున్న కులతత్వం పార్లమెంటు, శాసనసభ ఎన్నికల్లో ఎంపిక చెయ్యడంలో అంతా ఉంటోంది. చివరకు కాలేజీ మేనేజిమెంటు కనుసన్నలలో కూడా యిది పెరిగి పెద్దదవుతున్నది. విద్యార్థి సంఘ నాయకుడుగా ఒక విద్యార్థి ఎన్నికైతే అతడే కులంవాడో ఆరా తీస్తున్నారు. విద్యార్థులలో కులతత్వబీజాలు పడకుండా చూడటంపోయి యిటువంటి తత్వాలను ప్రేరేపిస్తే అది చాలా విచారకరమైన విషయం అవుతుంది. కాబట్టి విద్యార్థులకు కులతత్వ భావాలు సోకకుండా విద్యార్థిసంఘాలు జాగ్రత్తవహించవలసి ఉంది.

—దొప్పలపూడి సాంబశివరావు



# విద్యార్థులు : క్రమశిక్షణ

వి. రామకృష్ణ

విద్యార్థులలో క్రమశిక్షణ, జాతీయోత్సాహం తగ్గుతున్నాయంటే అందుకు విద్యాలయాలలోను, సమాజంలోను వున్న పరిస్థితులు కూడా కారణమే. విద్యార్థులలో అభివృద్ధికర భావాలున్న వాతావరణం అడుగున పడిపోవడంకూడా కారణమే. అందుచేత విద్యార్థులలో జాతీయ చైతన్యం, దేశభక్తి కల్గించాలి. విద్యాలయాల్లోను, సమాజంలోను పరిస్థితులను బాగు పరచాలి.

విద్యార్థులు - క్రమశిక్షణ అనే సమస్య చాలా ముఖ్యమైనదే గాక ఎంతో సున్నితమైనది కూడ. విద్యార్థులలో శిక్షణారాహిత్యం, అరాచకత్వం, అసభ్యపు అలవాట్లు ప్రబలిపోతున్నాయని ప్రతివారూ అనడమే గాక, వీటి నన్నిటిని విద్యార్థులకే అంటగట్టిచూడడం యెంతో శోచనీయం. ఈ సమస్యను ముందే పేర్కొనినట్లు, సునిశితదృష్టితోను, సానుభూతితోను పరిశీలించి విద్యార్థులలో నేడు కానవస్తున్న యీ చెడును నిర్మూలించి వారిని సరియైన మార్గంలో పెట్టడ మెలాగన్న సమస్యపై విద్యార్థి భవిష్యత్తును కాంక్షించే ప్రతి ఒక్కరూ ఆలోచించవలసిన పని. ఆ విధంగాగాక నలుగురూ నాలుగురాళ్లు విద్యార్థిలోకంపై విసరి అసలు విషయాన్ని గందరగోళపరుస్తున్నారు. అటు దేశనాయకులు, ఇటు ప్రభుత్వం ఇద్దరూ విద్యా సమస్యలను కూలంకషంగా పరిశీలించి కొన్ని నిర్మాణాత్మకమైన సూచనలు గావించిన 'రాధాకృష్ణన్ నివేదిక' లోని విషయాలుగాని, ప్రముఖ విద్యావేత్తలైన శ్రీ హుమయూన్ కబీర్ లాంటి వారు "ఎడ్యుకేషన్ ఇన్ ఇండియా" అన్న పుస్తకంలో క్రమశిక్షణను

గురించి వెలిబుచ్చిన కొన్ని అమూల్యాభిప్రాయాలనుగాని పరిశీలించు తున్నట్లు కనపడదు. వాటిని ఆచరణలో పెట్టడానికి ఇసుమంతైనా కృషి చేస్తున్నట్లు అగపడదు.

విద్యార్థికూడ ఇతరులలాగే సంఘంలో అంతర్భాగం. అతడు సంఘ జీవి. సామాజిక పరిస్థితుల ప్రభావం అతనిపై గాఢంగా ప్రసరిస్తుంది. కాబట్టి విద్యార్థి సమస్యలు-అవి ఏవైనా సంఘానికి సంబంధంలేకుండా చర్చించుకొని కొన్ని అభిప్రాయాలకు రావడం ప్రమాదకరం. అలా చేసినట్లయితే మనం ఆ సమస్యలను పాక్షిక దృష్టితోనే పరిశీలించినట్లవుతుంది.

కాబట్టి ఈ శిక్షణా రాహిత్యం చాలవరకు సామాజిక పరిస్థితులపై ఆధారపడివుందని గ్రహించాలి.

## నా య క త్వ లో ప ం

విద్యార్థులలో నేడు కానవస్తున్న ఈ శిక్షణారాహిత్యం, అరాచకత్వం - వీటిని విద్యార్థిలోకానికంతటికీ ఆపాదించరాదు. విద్యార్థులలో ఎప్పుడూ ఒక వర్గమే ఇలాంటివాటిని ప్రోత్సహిస్తూ వుంటుంది. కాని కొన్ని దశల్లో ఈ వర్గపుబలం అతిశయించడమూ, బలహీనబడడమూ జరుగుతూవుంటుంది. కాని విద్యార్థుల్లో ఉన్నతాదర్శాలు, విలక్షణమైన భావాలు గల పురోగామివర్గం లేకపోలేదు. దానిబలం కూడ దశలవారీగా మారుతూవుంటుంది. అధ్యాపకులను అవమానించే, తోటి విద్యార్థినులను అగౌరవపరచే, క్లాసురూము వాతావరణాన్ని కలుషితంచేసే వర్గమొకటి ఎప్పుడూ వుంటూనేవుంది. కాని దానిని అదుపులో పెట్ట గల శక్తి రెండవ వర్గానికి వుంటూండేది. ఇప్పుడా వర్గపు బలహీనతయే ఈ దుష్ట పోకడలుపోతున్న వర్గానికి బలం చేకూర్చింది. అందుమూలాన సాధారణంగా ఏ కొద్దిమందికో పరిమితమైవున్న ఈ వర్గం, దినదినానికి బలపడడం, రెండవ వర్గం చూస్తూ వుండిపోవడం జరుగుచున్నది.

## పటిష్ఠమైన విద్యార్థి సంఘాల కొరత

గతంలో కొన్ని నిర్దిష్టమైన ఉన్నత ఆదర్శాలతో ఏర్పడ్డ విద్యార్థి సంఘాలు విద్యాసంస్థల్లో ఎక్కువభాగం విద్యార్థుల్ని ఆకర్షించి, సంఘశిక్షణ క్రిందవుంచి వారిలో ఆదర్శపూరితమైన భావాలను ప్రబోధించేవి, విద్యార్థుల

విరామ సమయాన్ని ఉపయోగకరమైన చర్చలు, సంస్కృతీ కార్యకలా
పాలను నిర్వహించడం ద్వారా ఉపయోగించేవి. ఉదాహరణకు గతంలో
విద్యార్థి ఫెడరేషన్ అన్నిచోట్లా కొన్ని సత్సంప్రదాయాలను నెల
కొల్పింది. అల్లరిచేసేవారిని అదుపులో పెట్టడం, విద్యార్థినులపట్ల గౌరవభావం
పెంపొందించడం, వారి యెడల అసభ్యంగా ప్రవర్తించినవారిపై అజమా
యిషీ వుంచి, వారికి రక్షణ కల్పించడం – ఇలాంటివి ఎన్నో వుండేవి.
ఇదంతా నాడు ఆ సంస్థకుగల శక్తిస్తోమతలవల్లనే జరిగింది.

## విద్యా విధానంలో లోపభూయిష్టత

భారతదేశం రాజకీయ స్వాతంత్ర్యాన్ని గడించి దశాబ్దములయింది.
స్వాతంత్ర్య సముపార్జనలో, దేశ దాస్యాన్ని తొలగించడంలో గణనీయ
మైన కృషి గావించిన విద్యార్థి, తన భవిష్యత్తును తీర్చిదిద్ది అభివృద్ధికి
చక్కని అవకాశాలను కల్పించగల జాతీయ విద్యా విధానాన్ని మనః
పూర్వకంగా అభిలషించాడు. అది నాటికీ, నేటికీ పగటికలగానే వుండి
పోయింది. ఆశించిన అభ్యుదయకర పరిణామాలు సంభవించక ఆశాభంగం
పొందిన విద్యార్థి, ఆశించని పరిణామాలకు గురి అయ్యాడు. కళాశాల విద్య
గగనకుసుమమై పోయింది. విద్యా సముపార్జన ఇంత క్లిష్ట సమస్యగా
తయారుకాగా, విద్యార్థి భవిష్యత్తు కారుచీకటి. కన్ను పొడుచుకున్నా
వెలుగు కాన్పించని అంధకారంలో విద్యార్థి సతమతమవుతున్నాడు.
తత్ఫలితమే నేడు విద్యార్థిలోకంలో ఎల్లెడలా కానవస్తున్న నిరాశ,
నిస్పృహ, ఇవే క్రమేపీ శిక్షణా రాహిత్యానికి దోవ తీస్తున్నాయి.
విద్యార్థికి సరియైన విద్యావిధానం ద్వారా చదువులో శ్రద్ధను, ప్రతి
విషయాన్ని లోతుగా ఆలోచించే జిజ్ఞాసను కల్గించాలి. దీనికి పునాది
అతని భవిష్యత్తుపై అతనికి సంపూర్ణమైన విశ్వాసముండడం. అలాంటప్పుడు
విద్యయే ప్రధానాశయంగా ఎంచుకోవడమేగాక బాధ్యతాయుతంగా
ప్రవర్తించడమూ జరుగుతుంది.

## విద్యావిధానానికీ, ప్రణాళికలకూ పొత్తులేదు

నేటి విద్యార్థులు రేపటి పౌరులు. కాని యీ విషయాన్ని ప్రతి
ఒక్కరూ ఒక ఊతపదంగా ప్రతి విద్యార్థి సభలోను, విద్యార్థులకు
సంబంధించిన సమస్యలపై అనర్గళంగా ఉపన్యాసాలిచ్చేటప్పుడు ఉపయో

గించడమే కాని, వాని లోతుపాతులను తీవ్రంగా పరిశీలించారా అన్న సంశయంకలుగక మానదు. విద్యార్థులను భావి పౌరులుగా తయారుచేస్తున్నారా అనేదే నేటి సమస్య. విద్యార్థులు భావిపౌరులని ఉపన్యాసాలు ఏ వేదిక నుండి చెబుతున్నారో అదే వేదికనుండి విద్యార్థులకు దేశ రాజకీయాలకు సంబంధంలేదని, వారు దేశవ్యవహారాల్లో జోక్యం కల్గించుకోకుండా వారి చదువుసంధ్యలకే పరిమితం కావాలని ఉద్ఘాటిస్తారు. ఇక్కడే ఆరంభమవుతుంది అసలు చిక్కు. కాని దేశ రాజకీయాలతో సంబంధం పెట్టుకోనినందువలన, రాజకీయపార్టీల స్వరూపాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, ప్రభుత్వం ముందడుగు వేయడానికి వారు ప్రోత్సాహకరంగా వుంటారు. అదేవిధంగా జాతీయ ప్లానింగ్, పంచవర్ష ప్రణాళికలు జయప్రదం కావాలంటే కూడా విద్యార్థులు ప్రముఖ పాత్ర వహించాలని, ప్రణాళికలను ఆటంకాలు కల్గిస్తున్న అభ్యుదయ నిరోధకశక్తుల ఆటలు కట్టించాలంటే విద్యార్థులే సరియైనవారని ప్రముఖ ఆర్థికవేత్తలైన శ్రీ వి. కె. ఆర్. వి. రావు లాంటివారు తమ అభిప్రాయములను వెలిబుచ్చుతున్నారు. అదీగాక నేడు వీటితో ఏవిధమైన సన్నిహిత సంబంధం లేకుండా విద్యార్థులు తమ విద్య ముగిసినతర్వాత ప్రవేశింపబోయే వివిధ శాఖలలో వారి వారి బాధ్యతలను ప్రణాళికా విజయానికి ఏవిధంగా నిర్వహిస్తారు? ప్రభుత్వమూ, విద్యా విధానమూ రెండూ విద్యార్థిని ఈ గురుతరమైన బాధ్యతనుండి తప్పించ చూస్తున్నాయి. ఈ విధంగా చేయడం భావిలో దేశానికి అత్యంత ప్రమాదకరం. పైగా విద్యార్థులను వారి తీరిక సమయాల్ని, వారి ఆలోచనల్ని, వారి శ్రద్ధాసక్తులను, ఈ విధంగా ఉపయోగకరమైన విషయాలపై మళ్ళించడం ద్వారా వారిని మంచిమార్గాన పెట్టినట్లవుతుంది. ఈ విధంగా చేసినప్పుడే చౌకబారు డిటెక్టివ్, సెక్సు సాహిత్యాల పఠనానికి, పెడతోవన బెట్టే చలనచిత్రాలకు కాలాన్ని వృధా చేయడం తగ్గుతుంది. అప్పుడే విద్యార్థి తన బాధ్యత పెరిగిందని గుర్తిస్తాడు. తనపైనున్న బాధ్యతలను నిర్వర్తించడానికి సర్వవిధాలా కృషిచేస్తాడు.

## సమాజ పరిస్థితి - దాని ప్రభావం

విద్యాలయాల్లో క్రమశిక్షణ వెలుపల సమాజంలోవుండే జీవన పరిస్థితులకు ప్రతిబింబం. సమాజంలోని కలుషత్వా, అరాచకత్వం తగ్గాలి.

క్రమశిక్షణ పెరగాలి. సంఘంలోని వ్యక్తులు శిక్షణా గాఢత్వాన్ని, అరాచకత్వాన్ని వదలనంతకాలం విద్యార్థులపై వాని ప్రభావం వుండక మానదు. అసలు ఒక్కసారిగా క్రమశిక్షణ విద్యాసంస్థల్లో నేర్పగలిగింది కాదు. దానికి పునాది చిన్ననాటినుండి అలవరచినట్లయితే, అది వారిలో పెంపొందుతుంది. కాని క్రమశిక్షణకు విద్యాసంస్థలతోపాటు సంఘ పరిస్థితులు, గృహ పరిస్థితులు తోడ్పడాలి.

## అధ్యాపకుల ఆదర్శం

విద్యార్థులను సరియైన మార్గంలో పెట్టగలశక్తి విద్యార్థి దశలో అధ్యాపకులకే ఎక్కువగా వున్నదనేది నిర్వివాదాంశం. వారే విధంగా మలిస్తే ఆ విధంగా తయారవుతారు విద్యార్థులు. కాని వారు నేడు విద్యార్థులకు సరియైన నాయకత్వం వహించే స్థితిలో లేరు. దానికి కారణాలు అనేకం. అధ్యాపకులు తమ శక్తి సామర్థ్యాలను, కాలాన్ని విద్యాలయంలోనే కేంద్రీకరించి పనిచేయడానికి తగిన అవకాశాలులేవు. జీవన వ్యయం పెరిగినా, వారి వేతనాలు పెరగవు. వారికి సంఘాలలో తగిన ప్రతిపత్తి లేదు. వారికీ విద్యార్థులకూ మధ్య సన్నిహిత సంబంధాలకు ఎక్కువ అవకాశాలు లేకపోవడం; విద్యా సమస్యలను పరిష్కరించడంలో, విధానాలను నిర్ణయించడంలో వీరికి పూర్తిగా ప్రాతినిధ్యం లేకపోవడం; కనీసం పరీక్షలు, సిలబసు వీటి విషయంలో కూడా అంతిమ నిర్ణయాలు చేసేప్పుడు వీరికి ప్రమేయం లేకపోవడం; రాజకీయ నాయకులు విద్యాసంస్థలపై ప్రాభవాన్ని కలిగివుండడం - ఇవన్నీ అధ్యాపకుల ప్రాధాన్యతను తగ్గిస్తున్నాయి. పరీక్షలకు యివ్వవలసినంత ప్రాధాన్యతను మన విద్యావిధానం యిస్తోంది. ఉపాధ్యాయులు విద్యార్థులను పరీక్షలకు తయారుచేసే ఏజెంట్లుగా వుంటున్నారంటే అతిశయోక్తి కాదు. జీతాలు తక్కువగా వున్నందున వారు ట్యూషన్లు చెప్పుకోవడం, వాటిమూలాన వారికీ, విద్యార్థులకూ మధ్య వ్యాపార మనస్తత్వం పెంపొందడం సంభవించుతూంది. దీనివలన వారి విధులను సక్రమంగా నిర్వర్తించుకోలేక, విద్యార్థులపై తమ పలుకుబడిని, అజమాయిషీని కోల్పోతున్నారు. పై కారణాలవలన ఉపాధ్యాయులు విద్యావిషయికంగా ఒక హీనస్థితికి వచ్చారు. వారి ఆదర్శం నాయకత్వం పూర్తిగా తగ్గిపోయాయి. ఈ నాయకత్వపు లోపంవలన,

శక్తివంతులైన విద్యార్థులను వారు అదుపులో ఉంచుకొని చక్కని పౌరులుగా తీర్చిదిద్దలేకపోతున్నారు.

నేడు విద్యాసంస్థల్లోకి ఎక్కువభాగం ఆర్థికంగా చాల వెనుకబడిన వారు ప్రవేశిస్తున్నారు. దారిద్ర్యం విలయతాండవం చేస్తున్న నేడు విద్యార్థి ఆర్థిక చిక్కుల్లో సతమతమవుతున్నాడు.

## ప్రత్యామ్నాయ సూచనలు

విద్యార్థుల్లో భావుకులైన వర్గం, ఉన్నతాదర్శాలుగల వర్గం ఇకనైనా మేల్కొని ఇతర విద్యార్థులను కూడగట్టుకొనివచ్చి ఉన్నతభావాలను వ్యాపింపచేయడంద్వారా ఇతర విద్యార్థుల శిక్షణారాహిత్యాన్ని అదుపులో వుంచాలి. ఐక్య విద్యార్థి ఉద్యమం ఏర్పడాలి.

విద్యార్థులు, విద్యావేత్తలు అందరూ కోరుతున్న దేశ సౌభాగ్యాన్ని, జాతి రూపురేఖలను తీర్చిదిద్దగలిగిన ఒక జాతీయ విద్యా విధానాన్ని ప్రవేశపెడితే శిక్షణారాహిత్యం చాలావరకు ఉపశమిస్తుంది. విద్యావకాశాలు ఎక్కువగా కల్పింపబడాలి, విద్య పూర్తయిన పిదప ఉద్యోగాలను చూపడం విధిగా జరగాలి.

## విద్యాలయాల బయట చక్కపడవలసిన పరిస్థితులు

క్రమశిక్షణ క్లాసు రూములలో ఒక్కసారిగా నేర్పేది కాదు. దానికి సమాజ పరిస్థితులుకూడ దోహదం పడాలి. తల్లి దండ్రుల కమిటీలు ఏర్పడి యీ విషయంలో శ్రద్ధ వైకొనాలి. వారు అప్పుడప్పుడు అధ్యాపకులను కలుసుకుంటూ వారి పిల్లల బాగోగులను గురించి తెలుసుకుంటూ వుండాలి. కొంతవరకు వారు క్రమశిక్షణను అలవర్చాలి. సమాజంలో వుండే వాతావరణం ఈ సమస్యను ఎక్కువ చేసేదిగా వున్నది. సాహిత్యం గాని, వార్తా పత్రికలు గాని, చలన చిత్రాలుగాని క్రమశిక్షణకు దోహదం చేయకపోగా, శిక్షణారాహిత్యాన్ని ఎక్కువ చేస్తున్నాయి. సెక్సు డిటెక్టివ్ సాహిత్యాలను, కామోద్రేకాన్ని రెచ్చగొట్టి డబ్బు చేసుకునే సినిమా చిత్రాలను, జాతి నవమానపరచే భవానీ జంక్షన్ వంటి సినిమా చిత్రాలను ప్రభుత్వం తక్షణమే నిషేధించాలి. అప్పుడే విద్యాలయాల్లో నేర్పబడే క్రమశిక్షణకూ, సమాజంలోవున్న పరిస్థితికీ సామరస్యం ఏర్పడుతుంది.

## అధ్యాపకుల స్థితిగతులను బాగుపరచాలి

అధ్యాపకుడు క్రమశిక్షణకు మూల విరాట్టు. అతనిలో ఏ విధమైన లోపమున్నా, అది వెంటనే విద్యార్థులపై ప్రసరిస్తుంది. ఉపాధ్యాయులను నియమించడంలో తగు జాగ్రత్తలు గైకొని, సరియైన శక్తి సామర్థ్యాలు గల వారిని నియమించాలి. క్లాసుయొక్క సంఖ్య విపరీతమైపోయి, ఉపాధ్యాయుడు విద్యార్థులపై సరియైన జాగరూకతను చూపలేకపోతున్నాడు. కావున క్లాసులో విద్యార్థులసంఖ్యను పరిమితం చెయ్యాలి. అధ్యాపకుల ఆర్థిక పరిస్థితులను బాగుపరచాలి. అనగా వారికి హెచ్చుజీతాలు చెల్లించాలి. వారి వృత్తిలో సేవ ప్రఖ్యాతులు గడించినవారికి ప్రత్యేకమైన వసతులు కల్పించి, ఇతర దేశాలలో శిక్షణ ఇప్పించాలి. వారికి సమాజంలో తగిన గౌరవ ప్రతిపత్తులు కల్పించాలి. ఏ విద్యా సంస్కరణ అయినా ఉపాధ్యాయులను కమిటీలలో చేర్చడంద్వారా నిర్ణయింపబడాలి. ట్యూషన్లను నిషేధించాలి.

## విద్యార్థుల ఆర్థిక చిక్కులను తొలగించాలి

స్కాలరు షిప్పుల సంఖ్యను ఇంకా ఎక్కువచేయాలి. విద్యాలయాల్లోనే పేద విద్యార్థులకు ఏదైనా పని వసతి కల్పింపబడాలి. వారు విద్యనభ్యసిస్తూనే తీరిక సమయాల్లో పని చేయడంద్వారా కొంత డబ్బు గడించవచ్చు. స్వయం సహాయ కార్యక్రమాన్ని అమలులో పెట్టాలి. ప్రాథమిక విద్యాస్థాయిలో మధ్యాహ్నపు భోజనాన్ని ఉచితంగా అందరికీ అందజేయాలి.

ఇవిగాక మరికొన్ని శాస్త్రీయ పద్ధతులను కూడ అవలంబించవచ్చు. ప్రాథమిక తరగతుల్లోవున్న శిక్షణారాహిత్యాన్ని కొన్ని ప్రత్యేకమైన పరిస్థితులద్వారా నివారించాలి.

## స్వ యం పా ల న

పైన పేర్కొనినవే గాక విద్యాసంస్థలు ప్రజాస్వామిక సూత్రాలపై పనిచేయడం ప్రారంభించాలి. వాటి నిర్వహణలో విద్యార్థులకు తగు ప్రమేయం కల్పించాలి. అప్పుడు విద్యార్థి బాధ్యతారహితంగా ప్రవర్తించకపోవడమే గాక క్రమశిక్షణతో నడుచుకుంటాడు. విద్యార్థులందరినీ

ఎన్. సి. సి. లో చేరేటట్టు చూచి, అందులో నేర్పబడే క్రమశిక్షణ మిలటరీ మనస్తత్వాన్ని పెంపొందించకుండా, విద్యార్థులను బాగుపరచేటట్లు వుండాలి. చర్చలు, సెమినార్సు, సాంస్కృతిక కార్యకలాపాలను యెక్కువచేసి విద్యార్థులు వాటిలో పాల్గొనేటట్లు చేయాలి. ఉపాధ్యాయుల సంఖ్యనుకూడ పెంచాలి.

ఈ విధంగా చేయటంద్వారా విద్యార్థులలోవున్న శిక్షణారాహిత్యాన్ని, అరాచకత్వాన్ని చాలవరకు పారద్రోలగలం. క్రమశిక్షణ విద్యార్థులను శిక్షించటంద్వారా సాధించలేకపోగా, దానికి వ్యతిరేకమైన ఫలితాలు రాగలవు. వారిని సరియైన పరిస్థితుల్లో ఉంచడంద్వారా, వారిలో మానసికమైన మార్పు కొనిరావడం ద్వారా దీన్ని సాధించగలం. శీలనిర్మాణంలో క్రమశిక్షణ ఎంతో ఉపకరిస్తుంది. క్రమశిక్షణను ఒక ఉన్నతమైన నైతికావసరంగా గైకొనాలి. ఇది ఉపాధ్యాయుని ఎడల వినయాన్ని ప్రదర్శించడంతో ప్రారంభమయి, ఎవరిపనులు వారు స్వయంసహాయంతో చేసుకొనేదశకు చేరుకోవాలి. అసిధారా వ్రతం లాంటి యీ సమస్యను జాగ్రత్తగా పరిష్కరించుకోడం ద్వారా, విద్యార్థుల ప్రతిభావ్యుత్పత్తులను, సృజనాత్మకశక్తులను, వారిలో వెల్లువుకుచున్న ఉత్తేజోత్సాహాలను సరియైన మార్గంలో ప్రసరింపచేయాలి. ఈవిధంగా చేస్తే భవిష్యత్తుకు చక్కని నాయకత్వాన్ని చేకూర్చుకోవడమే గాక దేశాన్ని సర్వతోముఖంగా, సౌభాగ్యవంతంగా చేసుకోగలం. ఈ సమస్యను పరిష్కరించుకోవాలంటే అందరూ 'సంఘగించక ముందుకడుగేయాలి!'



# క్రమశిక్షణ : ఉపాధ్యాయుల బాధ్యత

లోకాల చిరంజీవిరావు

నేటి విద్యార్థులలో క్రమశిక్షణ చాలతక్కువగా వున్నదని చిన్నలు, పెద్దలు పదే పదే అంటూవున్నారు. ఇరవై ముప్పై సంవత్సరాల క్రిందటి విద్యార్థికీ, ఈనాటి విద్యార్థికీ ఈ విషయంలో చాలా భేదముందని, దీనికి బాధ్యులు విద్యార్థులేనని కొందరు విమర్శిస్తున్నారు. కాస్త ఓపికతో పరిశీలిస్తే దీనికి బాధ్యులు ఒకరు కాదు; చాలమంది వున్నారని తోచకమానదు.

## ఆదరప్రాయమైన ఉపాధ్యాయుడు

ఉపాధ్యాయుడు శిక్షణారాహిత్యానికి ఎంతవరకు బాధ్యుడు అని ఆలోచిద్దాము. 'బ్రతికలేక బడిపంతులు' అనే సామెతను మనం వింటున్నాము. అలాంటివారే బడిపంతులు వృత్తిలో ప్రవేశించితే క్రమశిక్షణ ఎలా వుంటుంది? మంచి ఉపాధ్యాయుడు అంటే మంచి పాండిత్యం సంపాదించాలి. సంపాదించిన దానిని అధికం చేసుకుంటూవుండాలి. క్లాసుకు వెళ్ళేటప్పుడు తాను చెప్పబోయే పాఠమును పూర్తిగచూచి, తగిన విధముగ తయారై వెళ్ళాలి. పాండిత్యం వున్న ఉపాధ్యాయుని క్లాసులో విద్యార్థులు యిష్టంవచ్చినట్లు మాట్లాడగలరా? ప్రయివేట్లు కావాలని క్లాసులో పాఠాలు సరిగ్గాచెప్పని మాష్టర్లుకూడా వున్నారంటే ఉపాధ్యాయుడుగాక మరెవరు నిందార్హులు? ఉపాధ్యాయుడు ఆదర్శప్రాయమైన జీవితమును గడపాలి. నీతివాక్యాలు తాను చెప్పకుండానే నీతిని బోధించేటంత మార్గదర్శకుడు కావాలి. అంటే విద్యార్థితో సన్నిహితసంబంధం వుండకూడదని కాదు. తాను విద్యార్థులతో కలిసి మెలిసి వుంటూనే వారి మనస్తత్వ

ముని తెలిసికొంటూ వారి నడవడికలో లోపాలున్నచో సరిదిద్దుతూ ప్రవర్తించాలి. ఉపాధ్యాయుడు క్లాసుకు ఆలస్యంగా వెళ్ళుతూ, విద్యార్థులను సకాలానికి రావాలని చెప్పాడంటే వారి మాట ఎవరు వింటారు? విద్యార్థిబాగే తన బాగని యే ఉపాధ్యాయుడు తలుస్తాడో ఆ ఉపాధ్యాయుడే నిజమైన గురువు.

## విద్యార్థి బాధ్యత

విద్యార్థి ఎంతవరకు బాధ్యుడో కూడ ఆలోచిద్దాము. తన బాధ్యతను గుర్తించక, పెద్ద చిన్న తారతమ్యములను ఆలోచించకుండా, చదువంటే శ్రద్ధ వహించకుండా, డబ్బు ఖర్చు చేసి మార్కులు వేయించుకోవచ్చునని లేదా కాపీలు చేసి ప్యాసు కావచ్చునని అనుకుంటే అతనిని సరిదిద్దేది ఎలాగు? పరీక్షా హాలులో తనిఖీ చేసే ఉపాధ్యాయుని అవమానించి, బెదిరించి కాపీ చేయటానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ కాపీలను అరికట్టాలంటే ఏ మార్గాలున్నాయా అని ఆలోచిస్తూనే వున్నారు. కాని సరియైనమార్గం కనపడటంలేదు.

ఇక ప్రభుత్వంవారు దీనిలో ఎంతవరకు బాధ్యులు? ఈ విద్యా విధానంలో లోపం వున్నదా? ఏ విధమైన మార్పులు తేవాలి? అని వారు జాగ్రత్తగా ఆలోచించి, విద్యావిషయానికి ప్రముఖస్థానం ఇవ్వాలి. స్కూలు ఫైనలు పరీక్షకు వెళ్ళినవారు ఎంతమంది ప్యాసు అవుచున్నారని చూస్తే, నూటికి 30 లేక 40 కంటే ఎక్కువలేరు. విద్యావిధానమే మంచిది అయితే ఇంత తక్కువమంది ప్యాసు కావటమేమిటి? అని ఆలోచించాలి. ఇంగ్లీషులో మార్కులు పెంచి మరింతమందిని తప్పిస్తున్నారు. కాపీలు ఆపటానికి మార్గాలు సరియైనవి కనపడటంలేదు. ఎక్కువమంది ప్యాసు అయితే నిరుద్యోగ సమస్య తీవ్రరూపం దాలుస్తుందేమోననే భయం కూడ వుండవచ్చును. కాని ప్రభుత్వం అలా భయపడితే ఏమిచేయగలదు? నిరుద్యోగ సమస్యను రూపుమాపవలసిన గురుతరబాధ్యత ప్రభుత్వంపైన ఉన్నమాట వాస్తవం. తగినరీతిని వారికి సౌకర్యాలు కల్పించాలి. విద్యా సౌకర్యాలు ఎక్కువ చేయాలి. ఇతర దేశాలలోకూడ విద్యకు చాలా ప్రాముఖ్యత యిస్తున్నారు.

## సాంఘిక పరిస్థితుల ప్రభావం

ఈ కారణాలకుతోడు సాంఘిక పరిస్థితులుగూడ కొంతవరకు కారణమే. మనచుట్టూవున్న సినిమా ప్రపంచం మన విద్యార్థికి ఎట్లా ఉపయోగపడుతున్నది? విద్యావిషయిక ఫిల్ములు చాలా తక్కువ. ప్రజా సమూహమును ఆకర్షించటానికి స్త్రీ పురుష ప్రేమకలాపాలేగాని, మరి యితర విషయాలను నేర్పుతూన్నట్లు కనపడదు. సినిమా నిర్మాతలుగూడ భావిపౌరులను దృష్టిలో పెట్టుకొని కేవలము ధనాపేక్షతోనే కాక, దేశ శ్రేయస్సు దృష్ట్యాకూడ నడవాలి.

అయితే వీటన్నిటిని సవరించేది ఎలాగు అనేది చాలా గడ్డుప్రశ్న. దీనికి ఒకటేమార్గం: గురుకుల విద్యాపద్ధతి అవలంబించాలి. విద్యార్థి చదువు పూర్తి అయ్యేదాక బడిలోనేవుండాలి. ఉపాధ్యాయులమన్యనే వుండాలి. విద్య నేర్పువారికి, నేర్చుకొనేవారికి కూడ యీతిబాధలు వుండకూడదు. విద్యాలయాన్ని పట్టణాలకు దూరంగా వుంచాలి. 'బ్రతకలేక బడిపంతు' లన్న వారికి దీనిలో స్థానం వుండకూడదు. తల్లిదండ్రులు వీరిని ఏ విధముగానూ మందలించుటకు హక్కు వుండకూడదు. జిల్లాబోర్డులు, పంచాయితీ బోర్డులు మొదలైనవారి ఆధ్వర్యములో వీటిని నడపకూడదు. ఇటువంటి విశ్వవిద్యాలయాలకు సంపూర్ణ స్వాతంత్ర్య ముండాలి.

## పరీక్షా విధానం మారాలి

పరీక్షా విధానంలో కూడ కొంత మార్పు రావాలి. విద్యార్థికి కాపీ చేయాలి అనే భావం పోవాలి. అంటే రెండు మూడు సంవత్సరాలు చదివితే అంతటినీ కలిపి ఒకే పరీక్ష పెట్టేవిధానం తొలగించాలి. ఒక్కొక్క సబ్జక్టులో కొంత కొంతవరకే పరీక్షపెట్టి అది వచ్చిన తరువాత ముందుకు నడవాలి. విద్యార్థియొక్క "ప్రోగ్రెసు"ను జాగ్రత్తగా పరిశీలించి, దానికికూడ ప్రాముఖ్యత యిస్తే కాపీలు చేయవలసిన అవసరమే కనబడదు. విద్యకూడ బాగా నేర్చుకుంటారు.

★

# అవలక్షణాలను సరిదిద్దుకోవాలి

కొల్లి నాగేశ్వరరావు

విద్యార్థులు తమంత తాము సంస్కరించుకోవలసిన విషయాలెన్నో ఉన్నాయి. విద్యార్థులలో నేడు అవలక్షణాలు లేకపోలేదు. ఆ అవలక్షణాలు ఉన్నది కొద్దిమందే కావచ్చు. కాని ఇవి విద్యార్థులందరికీ చుట్టుకుంటాయి. అందుచేత ఇట్టి అవలక్షణాలను సరిదిద్దడానికి సత్వర కృషి అవసరం. విద్యార్థులు నేడు దేశ సమస్యలను గురించిగాని, సాంఘిక సాంస్కృతిక విషయాలపైగాని చర్చలు జరపడం అరుదుగా కనిపిస్తుంది. హోటళ్ళలోగాని, రోడ్డు కూడలి ప్రదేశాల్లోగాని కూడినపుడు విద్యార్థులు చేసే చర్చలు బాధ్యతారహితంగా ఉంటున్నాయి. క్లాసులు ఎగవేయటం, పరీక్షలకు గైరుహాజరు కావటం, ఉపాధ్యాయులను అవహేళన చేయడం, విద్యార్థినులపట్ల అమర్యాదగా ప్రవర్తించడం, రైళ్ళలో టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేయడం, కాఫీహోటళ్ళలో బిల్లులు ఎగవేయడం మొదలైన పనులు ఎవరో కొద్దిమందే చేసినా, వచ్చే అప్రతిష్ట విద్యార్థులందరికీ వస్తుంది. ఇటువంటి ధోరణులు ఈ మధ్యకాలంలో మితిమీరి, తోటి విద్యార్థులకు విద్యాసంస్థలకు అప్రతిష్ఠకల్గించిన ఘటనలున్నాయి. తాను వస్తున్నది విద్యకోసమనీ, తన ప్రథమ కర్తవ్యం విజ్ఞానాభివృద్ధి పొందడమనీ, భావిపౌరులుగా అభివృద్ధి కావాలనీ, అధ్యాపకులపట్ల గౌరవం చూపించాలనీ విస్మరిస్తే అటువంటి విద్యార్థి తనకు, విద్యార్థిలోకానికి, విద్యా సంస్థలకు, దేశానికి ఎట్టి గౌరవం చేకూర్చలేడు. ఇటువంటివారు దేశంగూర్చి, సమాజంగూర్చి ఏమి ఆలోచించగలరు?

దీనికితోడు విద్యార్థులచుట్టూ ఉన్న వాతావరణం కూడా కలుషితంగా ఉంటోంది. సినిమాపిచ్చి ప్రకోపింపచేయబడుతోంది. విద్యాలయాలకు హాస్టళ్ళుండవు. తల్లిదండ్రులతో నివసించని విద్యార్థులు ఏ పేటలలోనో నివసిస్తూంటారు. అవినీతికి ఆలవాలంగా ఉండేచోట విద్యార్థులు నివసిస్తే అక్కడి పరిస్థితులకు లోనై పతనం చెందుతున్నారు.

విద్యావిధానంలో లోటు, పరీక్షావిధానంలో లోటు, విద్యాలయాల్లో అసంతృప్తికరమైన పరిస్థితులు నేడు విద్యార్థులలో అశాంతి, ఆందోళన కల్గిస్తున్నమాట నిజమే. అయినప్పటికీ, విద్యార్థులు ఆదర్శ జీవితం గడపాలనే ప్రధాన విషయం మరచిపోకూడదు. విధ్యుక్త ధర్మాలను విస్మరించకూడదు. ఎవరైనా బాధ్యతారహితంగాను, అప్రతిష్ఠాకరంగాను ప్రవర్తించుతూన్నప్పుడు మిగిలినవారు చూస్తూ ఊరుకోవడం కూడదు. చెడ్డపనులకు దిగేవారిని వారించాలి. వారిలోని అవలక్షణాలను అరికట్టాలి. అందుకు విద్యార్థులందరూ కృషిచేయాలి. అధ్యాపకులు, పెద్దలు యిందుకు సహకరించాలి. విద్యార్థి సంఘాలు విద్యార్థులలోని మంచిని పెంచుతాయిగాని, కొందరు భావిస్తున్నట్టు చెడ్డను ఎన్నటికీ ప్రోత్సహించవు. విద్యార్థులలో జాతీయభావం, దేశభక్తి, జిజ్ఞాస కొరవడినప్పుడే బాధ్యతారహిత ప్రవర్తన, అరాచక లక్షణాలు, శిక్షణా రాహిత్యం ఎక్కువ అవుతాయి. ఈ విషయాన్ని అధ్యాపకులు, పెద్దలు గ్రహించాలి. సహజంగా మంచిమార్గాన వుండే 100కి 90 మంది సహకారంతో చెడ్డవారుగా వున్న పదిమందినీ సంస్కరించడం కష్టంకాదు. ఉపాధ్యాయులు, పెద్దలు చేయూత ఇస్తే విద్యార్థులలోనే స్వయంశిక్షణోద్యమం ప్రారంభం కాగలదు.



# విద్యార్థి జీవిత విధానంలో లోపాలు

ఆరుమళ్ళ వేమారెడ్డి

విద్యార్థులు తమ జీవిత విధానంలో ఉన్న లోపాలను గుర్తెరగాలి. డబ్బుకే తప్ప నైతిక ప్రమాణాలకు, నిజాయితీ నిరాడంబరతలకు చోటులేని ప్రస్తుత సమాజంలో విద్యార్థులు సద్గుణాలు అలవరచుకోడానికి ప్రయత్నించకపోతే ఆ చెడుగులన్నిటికి లోనవుతాం. విద్యార్థులలో కూడా దుస్తులనుబట్టి గౌరవించే మనస్తత్వం ఎందుకుండాలి? విలువైన దుస్తులు వేసుకుంటే వారితో మాట్లాడటం, నిరాడంబరమైన దుస్తులు వేసుకుంటే అతడు 18 వ శతాబ్దంలోనివాడనుకోవడం ఏమిటి?

నేటి విద్యార్థి ప్రపంచంలో మరొక చెడుగు ప్రబలంగా ఉన్నది. ఇతరుల్ని గౌరవించడానికి మారు వారిని చిన్నపుచ్చడం. దీనిని తమ తెలివితేటలుగా ఆధిక్యతగా కొందరు తలుస్తున్నారు. ఇది చాలా శోచనీయమైన పరిస్థితి. ఇతరుల్ని ఎప్పుడైతే గౌరవిస్తామో అప్పుడే మన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకున్న వాళ్ళమవుతామని గ్రహించాలి.

విద్యార్థినులు క్లాసులకు వెళ్తూన్నప్పుడు, తిరిగి వస్తున్నప్పుడు పిల్లి కుక్క నక్క ఒకటేమిటి అనేక జంతువుల అరుపులు వినిపిస్తాయి. మారుపేర్లుపెట్టి పిలుస్తూంటారు. వీటిని నుక్కాలు గోడలపై, డెస్కులపై వ్రాస్తూ వుంటారు. కొన్నిచోట్ల విద్యార్థులు తమ సైకిళ్ళ బెల్లులు, డైనమో బల్బులు, పుస్తకాలు, పెన్నులు పోతున్నాయని గగ్గోలు పెడుతూంటారు. క్లాసు మాస్టరు చెప్పే పాఠాలకన్నా బయటవున్న సైకిల్‌పైన ఎక్కువ శ్రద్ధ తీసుకోవలసిరావడం చాల విచారకరం. ఇవి చాలా చిన్న విషయాలే అయినప్పటికీ వీటి దుష్ఫలితాలు మాత్రం విద్యార్థిలోకానికెంతో కళంకంగా భావించాలి.

పల్లెలనుండి తల్లిదండ్రులు అనేక కష్టనష్టాల కోర్చి పంపే పైకాన్ని సద్వినియోగం చేసుకునేవారి సంఖ్యకూడా తగ్గుతూండడం గమనార్హం. కాఫీహోటళ్ళు, సిగరెట్లు వాడకం విపరీత మవుతున్నాయి. ఒక సినిమాను ఎన్ని ఎక్కువసార్లు చూస్తే అతడంత గొప్పవాడు !

పుస్తకాలు కొనుక్కోడానికి, ఫీజులు కట్టుకోడానికి తోటి విద్యార్థులు నానా అవస్థలు పడుతుంటే, పై విధంగా దుబారా చేస్తారు మరికొందరు. ఒక మిత్రుడు సూచించినట్లు విద్యార్థుల్లో బీద విద్యార్థుల సహాయార్థం స్వయం సహాయక సంఘాన్ని స్థాపించుకోడం అవసరం. ఈ విషయంమీదే శ్రీ జయప్రకాష్ నారాయణ్ ఒక ప్రణాళికను తయారు చేశారు. ప్రతి విద్యార్థి తాను ఖర్చుచేసే ప్రతీ రూపాయికి ఒక కానీ లేదా అర్థణా ఒక నియమం ప్రకారం విరాళమివ్వడం, ఆ నిధిని బీద విద్యార్థులకు పుస్తకాలు కొనుక్కోడానికి, ఫీజులుకట్టుకోడానికి సహాయం చేయడం–దాని లక్ష్యం. దీని నిర్వహణకు విద్యార్థిసంఘాలు పూనుకోవడం మంచిది.

పరీక్షలు దగ్గరపడేకొద్దీ కొంతమంది విద్యార్థులకు దేవాలయ సందర్శనాభిలాష పెరుగుతోంది. తమ కృషినిబట్టి, సాధననుబట్టి పరీక్షల్లో జయం పొందడానికి చూడాలిగాని పరీక్షల బాధ్యతను దేవుడిమీదపెట్టి ఏమి లాభం ?

ప్రతివారూ కుల మత వర్గరహిత సమాజాన్నే కోరుతున్నామని అంటారు. అయితే ఆచరణ శూన్యంగా ఉంది. భావిపౌరులమైన మన ద్వారానే ఆ పని జరగాలి. అభివృద్ధికి ఆటంకమైన యీ కుల వర్ణ విభేదాలను మనమే ప్రతిఘటించాలి. నవసమాజ నిర్మాణంలో యిదే నేటి విద్యార్థి యువకుల ముఖ్య కర్తవ్యం !

**ఈ విధంగా** విలాసానికి బదులు నిరాడంబరత్వం; చెడ్డ అలవాట్లకు మారు మంచి అలవాట్లు; ఇతరుల్ని చిన్నపుచ్చే కుర్రతనపు చేష్టలకు బదులు యితరులను గౌరవించడం; దుబారాకు మారు పొదుపుచేసి యితరులకు సహాయం చేయడం; కులతత్వాలకు స్వస్తిచెప్పడం - అలవరచుకోవాలి.

★

# ఐక్య విద్యార్థి ఉద్యమ ఆవశ్యకత

## (సమీక్ష)

పరకాల పట్టాభిరామారావు

విద్యార్థులలో జాతీయోత్సాహం దీక్ష కానరావటంలేదని, వారిలో శిక్షణారాహిత్యం, అశాంతి ప్రబలుతున్నాయని విమర్శలు ఎక్కువగానే యీ మధ్యకాలంలో వినపడుతూ వచ్చాయి. అందుచేత యీ విమర్శల గురించి విద్యార్థులు ఏమనుకుంటున్నారో, వారు తమ కర్తవ్యాలను గురించి యేమని భావిస్తున్నారో వెల్లడింపజేయడానికి యీ చర్చ ఉద్దేశింపబడింది. చర్చలో ఆంధ్రలోని ప్రధాన విద్యార్థి సంస్థలు, పలువురు విద్యార్థులు, విద్యార్థినులు పాల్గొన్నారు.

## జాతీయ పునర్నిర్మాణంలో విద్యార్థుల పాత్ర

స్వాతంత్ర్య పోరాటంలో విద్యార్థులు ఏవిధంగా ప్రముఖ పాత్ర వహించారో అదేవిధంగా దేశ పునర్నిర్మాణ దశలోకూడా వారు ప్రముఖపాత్ర వహించవలసివుంది. ఈ విషయాన్ని దేశ నాయకులు తగినంతగా గుర్తించడంలేదు. విద్యార్థుల కర్తవ్యాలను నిర్దిష్టం చేయడంలేదు. విద్యార్థులు తమ కోర్కెల కొరకు ఆందోళనచేస్తే వారిని ఆందోళనకారులని విమర్శించితే సరిపోదు. వారి సమస్యలను చక్కదిద్దాలి. వారుకూడా జాతిలో ఒకభాగం కనుక వారి జాతీయ కర్తవ్యాలనుకూడా నిర్వచించాలి. అప్పుడే వారిలో ఉత్సాహం, దీక్ష ప్రస్ఫుటమవుతాయి. విద్యార్థులు తమ అభిప్రాయాల్లో ప్రధానంగా ఈ విషయాన్ని పేర్కొన్నారు.

## విద్యార్థి ఉద్యమ పునరుద్ధరణ

విద్యార్థి సంఘాలు ఎందుచేత నిస్తబ్దత వహించాయి? విద్యార్థులు తమతమ అభిమాన రాజకీయ సంస్థల వెనుక విడివడి అనైక్యంగా ఉండి పోయారు. జాతీయ పునర్నిర్మాణంలో ఇంతవరకు రాజకీయపార్టీలన్నిటికి స్థూలమైన ఏకాభిప్రాయంలేదు. అదే విద్యార్థులలో ప్రతిబింబితమౌతూ వచ్చింది. ఈ రాజకీయ కందరగోళంలో విద్యార్థులు తమ కర్తవ్యాలను నూతన పరిస్థితుల కనుగుణ్యంగా రూపొందించుకోలేకపోయారు. జాతీయ పునర్నిర్మాణం, విద్యా సంస్కరణలు, ఇతోధిక విద్యావకాశాలు ఒక దానితో ఒకటి ముడివడి ఉన్నాయని అర్థంచేసుకోలేకపోయారు. ఈ విషయాన్ని విద్యార్థులు తెలియజేశారు.

## విద్యా విధానంలో లోపాలు

విద్యా సంస్కరణలను పది సంవత్సరాల కాలంలో జాతీయ ప్రభుత్వం అమలు చేయలేకపోవడం విద్యారంగంలో నేటి సమస్యలన్నింటికి మూలకారణంగా విద్యార్థులందరూ పేర్కొన్నారు.

యథాప్రకారంగా గుమాస్తాలే విద్యాలయాలనుండి ఎక్కువగా తయారవుతున్నారు. దేశానికి నేడు అవసరమైన పారిశ్రామిక, సాంకేతిక, వ్యవసాయ శాస్త్ర నిపుణులు, పరిశోధకులు తయారుకావడంలేదు. దీనికి తోడు ప్రస్తుత పరీక్షావిధానంవలన ఎక్కువమంది విద్యార్థులు నిరర్థకులుగా నిలిచిపోతున్నారు. ఏదో ఒక జీవనరంగంలో అర్హులుగా తయారుకావడం పోయి పరీక్షలలో విఫలురై నూటికి 50 నుండి 70 వరకు విద్యార్థులు యిళ్ళకు తిరిగివస్తున్నారు.

## క్రమశిక్షణ సమస్య

విద్యావిధానంలోను, విద్యాలయాల్లోను ఉన్న అసంతృప్తికర పరిస్థితులవలన, అధ్యాపకులు తగినంతమంది లేకపోవడంవల్ల, వారి బోధనాస్థాయికూడా తగ్గిపోవడంవల్ల విద్యార్థులస్థాయి పడిపోతున్నది. వారిలో శిక్షణారాహిత్యంకూడా కొంత పెరిగింది. దీనికితోడు బైటనున్న సామాజిక పరిస్థితుల ప్రభావం, చౌకబారు సాహిత్యం తోడవుతున్నాయి. విద్యార్థిసంఘాలు చురుకుగా పనిచేస్తూ విద్యార్థుల మానసిక, శారీరక,

వైజ్ఞానిక, రాజకీయ చైతన్యాభివృద్ధికి తోడ్పడినప్పుడు విద్యార్థులలో కట్టుబాటు, క్రమశిక్షణ పెంపొందుతాయి. చర్చలో పాల్గొన్న విద్యార్థులందరూ యీ అభిప్రాయాన్నే వెల్లడించారు.

విద్యార్థి లోకంలో వ్యక్తం అవుతున్న కొన్ని అవలక్షణాలను, అరాచక తత్వాన్ని పలువురు విద్యార్థులు విమర్శించారు. విద్యార్థినులపట్ల అమర్యాదకర ప్రవర్తన, చదువులపై అశ్రద్ధ మొదలైనవి అరికట్టాలని, ఇందుకు విద్యార్థులలో విద్యార్థులే పూనుకోవాలని సూచించారు. అధిక సంఖ్యాకులైన విద్యార్థులు ఇటువంటి చెడునడత కలిగినవారు కాదనీ, అందు చేత కొద్దిమంది ఇటువంటివారుంటే వారిని విద్యార్థిసంఘాలు సరియైన దోవలోకి తీసుకురావాలనీ తెలియజేశారు. విద్యార్థులలో స్వయంశిక్షణ యొక్క ఆవశ్యకతను గుర్తించారు.

నేటి పరిస్థితుల కనుగుణ్యమైన విద్యాసంస్కరణలను సాధించడం ప్రధాన కర్తవ్యంగా ఉండాలని చర్చలలో పాల్గొన్నవారందరూ అభిప్రాయం వెలిబుచ్చారు. దేశ పునర్నిర్మాణానికిగాను పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా అమలు జరిగేట్టు చూడాలనీ, స్వాతంత్ర్యాన్నుండి సోషలిజానికి పురోగమించడమే ప్రధాన రాజకీయలక్ష్యంగా ఉండాలనీ విద్యార్థులు ఉద్ఘాటించారు.

## విద్యా సంస్కరణలు : రాధాకృష్ణ కమిషన్ నివేదిక

విద్యావిధానంలో రావలసిన సంస్కరణలు ఎల్లా ఉండాలి ? ఈ సమస్యపై చాల పరిశీలన జరపడం అవసరం.

డాక్టర్ రాధాకృష్ణ అధ్యక్షతను 1948 లోనే భారత ప్రభుత్వం యూనివర్సిటీ విద్యాకమిషన్‌ని నియమించింది. ఈ కమిషన్ ప్రస్తుత విద్యావిధానంలో చాలా ముఖ్యమైన మార్పులను సూచించింది. కాని వీటిని ప్రభుత్వం ఈనాటికీ అమలు చేయలేదు.

యూనివర్సిటీ విద్యాలక్ష్యాల గురించి చెబుతూ, నేటి దేశ అవసరాలకు ప్రస్తుత విద్యా విధానానికి ఎంత మాత్రం పొత్తులేదని రాధాకృష్ణ కమిషన్ విమర్శించింది. "కోట్లకొద్ది ధనం ఖర్చుపెట్టి దేశ పారిశ్రామికాభివృద్ధికోసం ప్రణాళికలు తయారు చేశారు. రహదారులు, నీటి వనరులు, గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా, ఆరోగ్యం, పారిశుధ్యం పెంపొందించ

డానికి పథకాలు వేశారు. ఇవన్నీ అసలు జరగాలంటే వృత్తి విద్యా సంస్థలు, వ్యవసాయశాస్త్రం, వైద్యం, ఇంజనీరింగ్ విద్యాలయాలను విరివిగా స్థాపించాలి. వృత్తివిద్య, సాంకేతిక విద్యలలో నిపుణులను అసంఖ్యాకంగా తయారుచేయాలి." (యూనివర్సిటీ కమిషన్ నివేదిక : పేజీ 45)

ప్రస్తుత విద్యావిధాన స్వభావాన్ని సమూలంగా మార్చివేయాలని కూడా రాధాకృష్ణ కమిషన్ సూచించింది.

"ఇతర ఆశయాలతో బాటు విద్యార్థిని ప్రజాస్వామిక సమాజంలో ఏదో ఒక వృత్తికి అర్హుడుగాను, ఉత్తమ పౌరునిగాను తయారు చేయాలి. ఈ రెండు లక్ష్యాలు ఒకదానికొకటి భిన్నంగా కావు......విద్య పరిపూర్ణ మానవుణ్ణి తయారుచేయాలి. ఈ విషయమై కారల్ మార్క్స్ ఇల్లా అన్నాడు: 'ఒక వయస్సు వచ్చినతరువాత ప్రతి పిల్లవానికి సృజనాత్మకమైన శ్రమను, విద్యను, వ్యాయామాన్ని బోధించాలి. ఇది సామాజికోత్పత్తిని పెంచడానికే కాక పరిపూర్ణ మానవుణ్ణి తయారుచేయడానికి కూడా అవసరం. యిది, ఆచరణద్వారా విద్య నేర్చుకోవాలన్న విషయంలో కారల్ మార్క్స్, గాంధీ ఒకే అభిప్రాయాన్ని వెల్లడించారు." (అదే నివేదిక)

## సృజనాత్మక శ్రమకు స్థానం కల్పించాలి

ఈనాటి విద్యలో పుస్తక విజ్ఞానం తప్పితే సృజనాత్మక శ్రమలేదు. వాస్తవిక జీవితంతో విద్యార్థులకు సంబంధంలేదు. అందుచేత యువతీ యువకులు జీవితానుభవం లేనివారుగాను, శారీరకంగా బలహీనులుగాను తయారవుతున్నారు. ఏటేటా సర్వీసుకమిషన్ పరీక్షల నివేదికలు యీ విషయాన్ని నొక్కిచెప్తూనే ఉన్నాయి. 1956-'57 నివేదికలో పబ్లిక్ సర్వీసు కమిషన్ విద్యార్థులలో మానసికాభివృద్ధి కల్గడంలేదని, పుస్తకాల్లో వున్నది వల్లించడంతప్ప అసలు విషయాన్ని వారు అవగాహన చేసుకోవడంలేదని, డిగ్రీలేతప్ప శరీర దారుఢ్యం లేనివారవడంవలన అనేకమంది అనర్హులుగా ఎంచబడుతున్నారని ప్రకటించింది. మద్రాసులో ఒక సభలో ప్రధాని నెహ్రూ మాట్లాడుతూ యీనాటి యువతీ యువకుల్లో నాజూకుతనం హెచ్చిపోయిందనీ, శరీర దారుఢ్యం బొత్తిగా లేనివారుగా తయారయ్యారనీ విద్యార్థులను మందలించారు. కాని దురదృష్టకర విషయం ఏమంటే

ప్రస్తుత విద్యా విధానంలో పరీక్షలు ప్యాసవడం పరమాశయంగా పెట్టారు. దేహదారుఢ్యం ఉంటేనే కాని డిగ్రీ ఇవ్వబోమని ఎక్కడా నిబంధన పెట్టలేదు! శారీరక శ్రమంటేనూ, శ్రమచేసి జీవించేవారంటేనూ న్యూనతా భావం పెంచి పోషించే ఈ విద్యావిధానాన్ని మార్చనంతవరకు ఈ శోచనీయస్థితి తప్పదు.

## వ్యవసాయశాస్త్ర విజ్ఞానం

మనది వ్యవసాయ దేశం అవడం వలన, ఆహార కొరత తీర్చటం ప్రధాన జాతీయ కర్తవ్యాలలో ఒకటి అవడంవలన వ్యవసాయోత్పత్తిని పెంచడానికి శాస్త్ర విజ్ఞానాన్ని జోడించాల్సివుంది. అందుచే ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత విద్యాలలో వ్యవసాయశాస్త్రం ప్రవేశపెట్టడం అత్యవసరమనీ, జాతీయార్థిక ప్రణాళికలలో ఇందుకు ప్రధానస్థానం యివ్వాలనీ కూడ రాధాకృష్ణ కమిషన్ సిఫారసు చేసింది.

ప్రస్తుత పరీక్షావిధానమంత లోపభూయిష్టమైన విధానం మరొకటి లేదనీ, ముందుగా సంస్కరించవలసిన దేమైనా ఉంటే అది పరీక్షా విధానమేననీ కమిషన్ సిఫార్సుచేసింది. ప్రభుత్వోద్యోగాలకు డిగ్రీ లుండాలనే నిబంధనను రద్దుచేయాలన్నది. సంవత్సరం పొడుగునా అభివృద్ధిని పరిగణనలోకి తీసుకోవాలి గాని, ఆఖరున పరీక్షలలో వచ్చే మార్కులనే ప్రధానంగా తీసుకోరాదని సూచించింది. కాని యీ ప్రధాన సిఫారసులను వేటినీ ప్రభుత్వం అసలు జరుపలేదు. వెంటనే యీ మార్పులనైనా ప్రవేశపెట్టాలని ఆందోళనచేయాలి.

## విద్యార్థుల, విద్యావేత్తల సదస్సు

సమగ్రమైన విద్యాసంస్కరణలను సాధించడం నేటి తక్షణ కర్తవ్యంగా పెట్టుకొని అందుపై ఐక్య కార్యాచరణకు విద్యార్థి సంఘాలు పూనుకోవాలి. గుంటూరు పట్టణంలోని అన్ని విద్యార్థి సంస్థలవారు, కాలేజీ యూనియన్ల ప్రతినిధులు, కొందరు అధ్యాపకులు ఐక్యసమావేశం జరిపి ప్రీ యూనివర్సిటీకోర్సు అసలు జరుగుతున్న పద్ధతిపైన యితర విద్యా సమస్యలపైన చర్చలు జరిపారు. ఇదే పద్ధతిలో యావదాంధ్ర విద్యార్థుల, అధ్యాపకుల సదస్సు జరపాలి. ప్రభుత్వంముందు విద్యాసంస్కరణల గురించి నిర్దిష్టసూచనలను పెటాలి.

## ఐక్య విద్యార్థి ఉద్యమానికి అవకాశాలు

విద్యాసంస్కరణలు - పంచవర్ష ప్రణాళిక, సోషలిస్టు సమాజ నిర్మాణం ఈ మూడు నినాదాలను తమ జాతీయ కర్తవ్యాలుగా వివిధ రాజకీయాభిప్రాయాలుగల విద్యార్థులు అంగీకరించుతున్నారు. కనుక వీటి ప్రాతిపదికపై ఐక్య విద్యార్థి ఉద్యమం నిర్మించడానికి నేడు పరిస్థితులు ఎంతో అనుకూలంగా ఉన్నాయి. అంతేకాక ఈ జాతీయ కర్తవ్యాలను నిర్వహించడం విద్యార్థులందరూ ఐక్యంగా ఉన్నప్పుడే వీలవుతుంది.

## పంచవర్ష ప్రణాళిక : విద్యార్థులు

దేశ పునర్నిర్మాణ కార్యక్రమంలో విద్యార్థులు ఏ విధంగా పాల్గొనాలనే సమస్యపై విద్యార్థులు వివిధ అభిప్రాయాలను వెలిబుచ్చారు. ప్రణాళికను దిగదీయడానికి జరుగుతున్న ప్రయత్నాలను ఎదుర్కొనడం, ప్రణాళిక నిర్వహణకు ప్రజాసహకారాన్ని సమకూర్చడం - వీటితోబాటు ఆచరణలో జరుగుతున్న దుబారాలను జరపకుండా చేయవలసివున్నదని కూడా సూచించారు.

జాతీయ పునర్నిర్మాణంలో ఒక ప్రధాన భాగం నిరక్షరాస్యతా నిర్మూలన. నేడు దేశంలో విద్యా విజ్ఞానాలు పొందగల్గే అదృష్టం కొద్దిమందికే వుంది. అసంఖ్యాకులు అజ్ఞానంలోను, అంధకారంలోను ఉండిపోతున్నారు. మానవుడు స్పుత్నిక్‌లను సృష్టించి విశ్వాంతరాళాన్ని ఒక వైపు జయిస్తూంటే మరొకవైపు మన పల్లెటూళ్ళ ప్రజలు సూర్య చంద్రుల్ని రాహు కేతువులు కబళించినప్పుడు గ్రహణాలు పడుతున్నాయని నమ్మే స్థితిలో ఉన్నారు. విద్యాలయ ప్రాంగణాల్లో అధునాతనశాస్త్ర విజ్ఞానం, మన గృహ ప్రాంగణాల్లో మూఢనమ్మకాలు గూళ్ళు కట్టుకొని ఉంటున్నాయి.

## పెద్దయెత్తున వయోజనవిద్యా ప్రచారోద్యమం

అందుచేత విద్యాభాగ్యం పొందుతున్న విద్యార్థులు ప్రజలలోని అజ్ఞానాన్ని పారద్రోలవలసిన మహత్తర కర్తవ్యాన్ని నిర్వహించాలి. పంచవర్ష ప్రణాళికలో వయోజన విద్యాప్రచారాన్ని తమ ప్రధానకర్తవ్యంగా

విద్యార్థులు స్వీకరించి, దేశవ్యాపిత ఉద్యమం నిర్మించాలి. వేసవిలో ప్రతి హైస్కూలు, కాలేజీ, యూనివర్సిటీలనుండి వందలాది విద్యార్థులు, విద్యార్థినులు అధ్యాపకులతో సహా పల్లెపట్టులకు వెళ్ళాలి. పెద్దల పాఠాలు, పత్రికా పఠనం, మేజిక్ లాంతర్లు, సినిమా ప్రొజెక్టర్లు, నాటకాలు, విచిత్రవేషాల ద్వారా పెద్దయెత్తున విజ్ఞాన ప్రచారోద్యమం నడపాలి. పంచవర్ష ప్రణాళికను కాపాడ్డానికి తగిన వాతావరణం సృష్టించాలి. పెద్దపెద్ద ప్రాజెక్టులలో పనిచేసే కార్మికులకు వినోదం, విజ్ఞానం సమకూర్చాలి.

## సాంకేతిక పరిజ్ఞానంలేనిదే సోషలిజం లేదు

దేశ పునర్నిర్మాణానికి మూలం పరిశ్రమల్లో, వ్యవసాయంలో సత్వరాభివృద్ధి. ఇన్నాళ్ళవరకు ఉద్యోగాలంటే ఆఫీసుల్లో కుర్చీల నంటిపెట్టుకొని పని చేయడమేనను భావన ఉంది. విద్యావంతులు ఈ మనస్తత్వాన్ని విసర్జించవలసిన తరుణం ఆసన్నమైంది. వ్యవసాయంలోను, పరిశ్రమల్లోను, ఉత్పత్తి పెరగాలంటే అధునాతన శాస్త్రవిజ్ఞానాన్ని, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఆ రంగాలలో ప్రవేశపెట్టాలి. ఇది విద్యావంతులద్వారానే తప్ప విద్య లేనివారివల్ల సాధ్యంకాదు. అందుచేత పారిశ్రామిక, వ్యావసాయిక రంగాలలో కృషికూడా ఉద్యోగంగానే భావించాలి. అప్పుడే పంచవర్ష ప్రణాళికను జయప్రదం చేయడానికి తద్వారా సోషలిస్టుసమాజ నిర్మాణానికి పురోగమించడం సాధ్యమవుతుంది. సాంకేతిక పరిజ్ఞానం లేనిదే సోషలిజం లేదని గుర్తించాలి.

## జాతీయోద్యమ సంప్రదాయాలను పునరుద్ధరించాలి

ఈతరం విద్యార్థి యువతీ యువకులు తమ చేతులతో తాము ఉజ్జ్వల భవిష్యత్తును నిర్మించుకొనే మహత్తర అవకాశం లభించింది. రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాహిత్య తదితర రంగాలలో నూతన పరిణామాలను తీసుకురావలసిన బాధ్యతను వీరే నిర్వహించాల్సిఉంది. జాతీయోద్యమ కాలంలో నిస్వార్థసేవ, నిజాయితీ, త్యాగం, నిరాడంబరత్వం అలంకారాలుగా ఉండేవి. కాని దురదృష్టవశాత్తు ఇప్పుడు ఆ సంప్రదాయాలు క్షీణించి స్వార్థం, పదవీ వ్యామోహం, అధికారకాంక్ష, అవినీతి, ఆశ్రిత

పక్షపాతం పెచ్చు పెరిగాయి. వేదికలపై చెప్పే దొకటి తరువాత చేసే దొకటిగా కన్పడుతున్నది. జాతీయోద్యమంలో సర్వస్వం ధారపోశామని అనుకుంటూ దాన్ని రూపాయలు అణాలు పైసల్లోకి మార్చుకునేతత్వం ప్రబలింది.

అందుచేత యువతీ యువకులు ఆచరణనే గీటురాయిగా తీసుకోవాలి. మాటకు చేతకు నేడు అన్ని రంగాల్లోను కన్పడుతున్న అంతరాన్ని ఎక్కడికక్కడ ఎదుర్కోవాలి. జాతీయోద్యమ సంప్రదాయాలను పునరుద్ధరించాలి. నిస్వార్థంగా దేశంకోసం పాటుపడాలి.

“దేశమును ప్రేమించుమన్నా మంచి అన్నది పెంచుమన్నా... వట్టిమాటలు కట్టిపెట్టోయ్ గట్టిమేల్ తలపెట్టవోయ్” అన్న గురజాడ మహాకవి గీతం విద్యార్థి యువతీ యువకులకు శిరోధార్యం కావాలి.



# అనుబంధం

## ఆంధ్రప్రదేశ్ విద్యార్థిఫెడరేషన్ కార్యవర్గ తీర్మానాలు

ఆంధ్రప్రదేశ్ విద్యార్థి ఫెడరేషన్ కార్యవర్గం గుంటూరులో 1958 ఆగస్టు 23, 24 తేదీలలో సమావేశమై కొన్ని ముఖ్యమైన తీర్మానాలు చేసింది.

ప్రపంచ ప్రఖ్యాత అణుశాస్త్రవేత్త జోలియో క్యూరీ, ప్రముఖ విద్యావేత్త అబ్దుల్ హక్‌ల అస్తమయానికి సంతాపం వెలిబుచ్చారు.

తక్షణమే వేగవంతంగా లెబనాన్, జోర్డాన్‌లనుండి సైన్యాలు ఉపసంహరించుకోవలసిందిగా అమెరికా, బ్రిటిష్ ప్రభుత్వాలను డిమాండు చేస్తూ [illegible] సమావేశం తీర్మానించింది.

ఆంధ్ర విద్యార్థుల తక్షణ సమస్యల పరిష్కారానికి అంగీకృత కార్యక్రమం చేపట్టి పనిచేసేందుకు కలసి రావలసిందిగా రాష్ట్రంలోని వివిధ విద్యార్థి సంస్థలకు, భిన్నాభిప్రాయాలుగల విద్యార్థి కార్యకర్తలకు విజ్ఞప్తిచేస్తూ రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యవర్గం తీర్మానించింది.

విద్యాభివృద్ధికి, విద్యార్థుల పురోభివృద్ధికి కృషిచేసేందుకు యూనివర్శిటీ విద్యార్థి యూనియన్ ప్రజాస్వామిక నిబంధనావళితో ఉండటం అవసరం. ఆంధ్రప్రదేశ్‌లో ఉస్మానియా యూనివర్శిటీకి మాత్రమే యూనివర్శిటీలోని, దాని అనుబంధ కళాశాలలలోని విద్యార్థులందరూ సభ్యులుగాగల యూనియన్ ఉంది. అలాగే ఆంధ్ర శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీలకు కూడా యూనివర్శిటీ విద్యార్థి యూనియన్లు ఏర్పాటు

చేయువలసిన అవసరం ఉంది. అందుకు తగిన చర్యలు గైకొనవలసిందిగా వివిధ కళాశాలల యూనియన్లకు, కార్యకర్తలకు ఈ సమావేశం విజ్ఞప్తి చేసింది.

ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్య విద్యాకేంద్రమైన గుంటూరులో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు ఏర్పాటు చేయటం ఉన్నత విద్యాభివృద్ధికి దోహద కారి కాగలదని భావిస్తూ, అందుకు అవసరమైన చర్యలు వెంటనే ప్రారంభించ వలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని, ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని కోరారు.

ఉద్యోగాలలో నున్నవారు పై చదువులు కొనసాగించేందుకు వీలు కల్పించే నిమిత్తం హైద్రాబాద్‌లో వలెనే, హెచ్చుమంది ప్రభుత్వోద్యోగులు, పారిశ్రామిక వ్యాపారసంస్థల ఉద్యోగులు గల ముఖ్య కేంద్రాలలో రాత్రి కళాశాలలు నెలకొల్పేందుకు చర్యలు గైకొనవల సిందిగా ప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరారు.

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రముఖ వ్యాపార పారిశ్రామిక కేంద్రమయిన విజయవాడలో ఇంజనీరింగు కాలేజీ నెలకొల్పవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరారు.

ఆంధ్రప్రదేశ్ హైస్కూళ్ళలో ప్రస్తుతం అమలులోనున్న తరగతి గరిష్ఠ పరిమితిని 55 నుండి 40 కి తగ్గించవలసిందిగాను, ఏ తరగతిలోనైనా 40 మంది విద్యార్థులకు మించితే తప్పక క్రొత్త సెక్షన్లు ప్రారంభించవల సిందిగాను 55 గరిష్ఠ పరిమితి సాకుతో ఉపాధ్యాయులు రిట్రెంచి చేయ బడరాదని ప్రదేశ్ ప్రభుత్వానికి విజ్ఞప్తిచేశారు.

స్కూలు ఫైనల్ పరీక్షలో హెచ్చుమంది విద్యార్థులు తప్పడానికి గల కారణాలను విచారించి నివేదికను తయారుచేసేందుకు ముగ్గురు సభ్యులతో ఒక ఉపసంఘం నియమించబడింది.

హిందీ పాఠ్యాంశాల బోధనకు తగినంత కాలాన్ని కేటాయించవల సిందిగాను, ఆ మేరకు ఇంగ్లీషుబోధనాకాలాన్ని, పాఠ్యాంశాలను తగ్గించవల సిందిగాను ప్రభుత్వాన్ని కోరారు.

ఈ సంవత్సరం పాఠ్యపుస్తకాలు ఆలస్యంగా వచ్చినందున స్కూలు ఫైనల్, మెట్రిక్యులేషన్ పరీక్షలకు తెలుగు, ఇంగ్లీషు పాఠ్యగ్రంథాలలో పోర్షన్లు తగ్గించవలసిందిగా సెకండరీ ఎడ్యుకేషన్ బోర్డును, ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలను కోరారు.

ప్రీ-యూనివర్సిటీ పరీక్షలలో సమాధానాలు తెలుగులో వ్రాసే అవకాశం కల్పించవలసిందిగా ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీలను కోరారు. ఈ సందర్భంలో ప్రీ-యూనివర్సిటీ విద్యార్థులు కన్నడభాషలో పరీక్షలు వ్రాసేందుకు అవకాశం కల్పిస్తూ మైసూరు యూనివర్సిటీ చేసిన నిర్ణయాన్ని ఆదర్శంగా తీసుకోదగునని సూచించారు.

మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సులో విశ్వవిద్యాలయాలవారు వెంటనే యీ క్రింది మార్పులు చేయాలని సూచించారు. పార్టు I లోని 'సి'ని తొలగించాలి. 'ఎ', 'బి' లను విభజించాలి. 'సి'లో ఉద్దేశించబడిన జనరల్ ఎడ్యుకేషనుకు దోహదకారి కాగలరీతిగా 'ఎ', 'బి' లలో నాన్ డిటెయిల్డు పుస్తకాలను నిర్ణయించాలి. మూడు సంవత్సరాల కోర్సులోనే స్పెషలైజేషన్ ప్రారంభించబడాలి. పార్టు II లో ఒక మెయిన్ సబ్జక్టు దానికి సన్నిహితమైన సబ్సిడియరీలతో కూడిన కాంబినేషన్లు వుండాలి. రెండవ సంవత్సరం తర్వాత I పరీక్ష ప్యాసు కాకపోయినా మూడవ సంవత్సరం అనంతరం II పార్టు పరీక్షకు హాజరు కానివ్వాలి.

1958 సెప్టెంబరు, 1959 మార్చి పరీక్షలలో ఇంటర్మీడియేట్ ప్యాసైన అర్హతగల విద్యార్థులకు మెడికల్ ఇంజనీరింగు కాలేజీలలో ప్రవేశమివ్వాలి. ఇప్పటికి మిగిలియున్న ఇంటర్మీడియెట్ విద్యార్థుల సౌకర్యార్థం రెండు సంవత్సరాల డిగ్రీ కోర్సును మరొక సంవత్సరం పొడిగించాలి.

ఇంటర్మీడియేట్ లో ఫీ కన్సెషన్ ఉండి తప్పిపోయి మూడు సంవత్సరాల డిగ్రీకోర్సులలో చేరిన విద్యార్థులకు వెంటనే ఫీ కన్సెషన్లు ఇవ్వాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

మూడు సంవత్సరాల డిగ్రీకోర్సులు ప్రవేశపెట్టినందువలన సాంఖ్య తగ్గిన ఫలితంగా స్టాఫును రిట్రెంచ్ చేయరాదని కోరారు.

విద్యార్థులలో నానాటికీ తీవ్రమవుతున్న కులతత్వ ధోరణులను కూకటివ్రేళ్ళతో పెకలించివేయుటకు ముందుకు రావలసిందిగా విద్యార్థి లోకానికి పిలుపు ఇచ్చారు.



